

శివుడు -
(ఎలిఫెంటా -శిల్పం
చిత్రకారుడు :
యం. రాజా,
దామెర్లస్కూలు
—రాజమండ్రి.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**


సంపుటము 49
సంచిక 7
19-10-55

మన్మథ నిజ ఆశ్వయుజ శుద్ధ పంచమి బుధవారం


ఉ
ప — తూ
ద

ఔరంగాబాదు
పర్భణి
అదిలాబాద్
భీర్
నాందేడ్
నిజాం బాదు
కరీంనగరం
ఉస్మానాబాదు
బిదర్
మెదక్
హైదరాబాదు
వరంగల్లు
గుల్బర్గా
నల్లగొండ
మహబూబ్ నగరం
రాయిచూరు

ఫజల్ ఆలీ కమిషన్ నివేదికలో సూచించబడిన హైదరాబాద్ నూతన రాష్ట్రస్వరూపం :

హైదరాబాద్ రాజ్యాన్ని మూడు భాషాప్రాంతాలుగా విడగొట్టి బీదర్ జిల్లాతోసహా తెలంగాణాను చేర్చి నూతన హైదరాబాద్ రాష్ట్రంగా రూపొందించాలని రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ కమిషన్ సూచించింది.




# భాషారాష్ట్రాలు

భారతదేశంలో ప్రస్తుతం ఉన్న 27 రాష్ట్రాలనూ భాషలవారీగా 16 రాష్ట్రాలుగా పునర్నిర్మించాలని ఫజలాలీ కమిషన్ భారతప్రభుత్వానికి సిఫార్సు చేసింది. కమిషన్ సూచనప్రకారం నూత్నరాష్ట్రాల స్వరూపం ఈ చిత్రంలో చూపబడింది.

# నూతన భాషారాష్ట్ర వ్యవస్థ

ఫజల్ ఆలీ, పండిట్ కుంజ్రూ, కె. పి. పణికర్ గార్లు సభ్యులుగా రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ నిమిత్తం భారతప్రభుత్వం నియమించిన కమిషన్ తమ నివేదికలో భాషాప్రయుక్తమైన రాష్ట్రాల నిర్మాణాన్ని సూచించారు. ఈ నివేదికలోని సూచనల ప్రకారం ఇప్పుడున్న మొత్తం 27 రాష్ట్రాలను ఈ క్రింది పట్టికలో చూపినట్లు మొత్తం 16 రాష్ట్రాలుగా పునర్నిర్మించబడాలి. హైదరాబాద్ రాజ్యాన్ని మూడు భాషాప్రాంతాలుగా విడగొట్టి, బీదర్‌తో సహా తెలంగాణా ప్రాంతాన్ని హైదరాబాద్ పేరుతో ప్రత్యేక రాష్ట్రంగా నిర్మించి, 1961 ప్రాంతాల ఎన్నిక కాగల ఈ ప్రాంత శాసన సభ్యులచేత విశాలాంధ్ర నిర్మాణం విషయమై తుది నిర్ణయం చేయించాలని నివేదికలో సూచించబడింది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమయంలో మైసూరులో చేర్చబడిన బళ్లారి మొదలైన తాలూకాలను తిరిగి ఆంధ్రరాష్ట్రంలో చేర్చివేయాలని కూడా ఫజల్ అలీ కమిషన్ సూచించింది.



అధ్యక్షుడు ఫజులాలీ



సభ్యుడు పండిట్ కుంజ్రూ



సభ్యుడు ఫణిక్కర్

## భారత సమాఖ్య (కొత్త) రాష్ట్రాలు: వాటి విస్తీర్ణం - జనాభా

| రాష్ట్రాలు | విస్తీర్ణం చదరపుమైళ్ళలో | జనాభా లక్షలలో | రాష్ట్రాలు | విస్తీర్ణం చదరపుమైళ్ళలో | జనాభా లక్షలలో |
|---|---|---|---|---|---|
| 1. మద్రాసు | 50,170 | 300 | 11. ఉత్తరప్రదేశ్ | 113,410 | 632 |
| 2. కేరళ | 14,980 | 136 | 12. బీహారు | 66,520 | 385 |
| 3. కర్ణాటక | 72,730 | 190 | 13. పశ్చిమ బెంగాలు | 34,590 | 265 |
| 4. హైదరాబాదు | 45,300 | 113 | 14. అస్సాం | 89,040 | 97 |
| 5. ఆంధ్ర | 64,950 | 209 | 15. ఒరిస్సా | 60,140 | 146 |
| 6. బొంబాయి | 151,360 | 402 | 16. జమ్మూ-కాశ్మీర్ | 92,780 | 44 |
| 7. విదర్భ | 36,880 | 76 | కేంద్ర పాలిత ప్రాంతాలు | | |
| 8. మధ్యప్రదేశ్ | 111,200 | 261 | 1. ఢిల్లీ | 578 | 17,44,072 |
| 9. రాజస్థాన్ | 132,300 | 160 | 2. మణిపూర్ | 8,628 | 577,635 |
| 10. పంజాబు | 58,140 | 172 | 3. అండమాన్ - నికోబార్ దీవులు | 3,215 | 30,917 |

# మధ్యదూరం

కందుకూరి లింగరాజు

మంగేశ్వరరావుకు పెళ్ళయినప్పటి నుండి అత్తవారినిగురించి ఆలోచించడమే ఎక్కువైపోయింది. పెళ్ళిలో కట్నాలు-కానుకల విషయం ఎల్లావున్నా వాళ్ళు చూపించినహోదా, అమర్చిన సదుపాయాలు, అంతా ఓగడియారంలో మరల్లా కనులయిపోవడం ముగ్ధుణ్ణిచేసింది. పైగా అంత నిర్దుష్టంగా ఏకీలు కాకీలు పనిచెయ్యడం అన్న విషయం ఆశ్చర్యంకల్గిస్తే, ఇదివరలో తను చూచిన పెళ్ళిళ్ళలో, కాలూ చెయ్యీ విరగతన్నుకోడాలు చూడ్డం ఇంత గొప్పగా పెళ్ళి ఎల్లా చెయ్యగల్గేరన్న ఆశ్చర్యం జమకూడి, మామగారు చాలా కంజాయింపు మనిషి అన్న భావం ఏర్పడిపోయింది.

విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'డ[illegible] రాముడు' చిత్రంలో ఎ. నాగేశ్వరరావు.



దీంతో, అత్తగారు, బావమరుదులు మరదళ్ళు వగైరా వాళ్ళ కుటుంబం అంతా ఒకళ్ళతర్వాత ఒకళ్ళు, వాళ్ళు వాళ్ళు పంచుకున్న పాత్రలు చూస్తే, అవీ కూడా సరిగ్గా సరిపోయేయన్నట్లు కన్పించేయి. దీంతో ఆ సంసారంలో ఈ వీళ్ళంతా అతుక్కుపోయిన సమిష్టిసముదాయం అనుకుని, గౌరవం పెంపొందించుకున్నాడు. వాళ్ళ రెండంతస్థుల భవంతి, హోదాకల్గిన ఉద్యోగం, లౌక్యంలో ఆయన సంపాదించిన స్వార్జితం, పలుకుబడి, ఉన్నతి, వీట్ల కలయిక అంతాకూడా పర్యవేక్షిస్తే ఓ అణకువ, భృత్యభావంకూడా కలగత్రించేయి.

దాంతో పుట్టింటివైపు సమీక్ష ఆరంభమయింది. చిన్న పల్లెటూళ్ళో ఫంశీ వ్యవసాయం చేయిస్తూ, పెద్దరైతులా జీవించే తన అన్నగారు, వాళ్ళ పిల్లలు, అక్క చెల్లెండ్లు, ఆ ఫాయిదాలో నేవున్న సంసారాలు, ఇవన్నీ కూడా యెన్నోంతరాలు అత్తవారికీ, పుట్టింటివారికి తేడావుంది. వీళ్లు వాళ్లవడానికి కనీసం నాలుగు పుట్టకలైనా పొందాలి అన్న భావన యేర్పడడానికి పునాదులు త్రవ్వేట్లు మనస్సు ప్రోత్సహిస్తోంది.

ఈ ప్రోత్సాహం, యిన్ని వత్సరాలు కూడా, కళ్లల్లో పెట్టుకునే, నీ పుట్టింటి వాళ్లు పెంచేరు, చదువు చెప్పించేరు, ఆఖరుకు నీ కాళ్లమీద నువ్వు నిలబడేవరకూ, అన్న కృతజ్ఞతను ప్రక్కనా, ఈ నవ్యజీవనంలోని మెరుపు - అతనిదృష్టిలోవున్నది - దానికి సమంజసమైనతలంపుయిచ్చి, నరాల్లో నిల్వకోడానికి వొప్పుకోలేదు. చదివినచదువులోని భావన, ఆశ, కొంతవరకూ, తొంభైతొమ్మిదిపాళ్లు, ఈమధ్యలో వచ్చిన సిరికలవాళ్ల సంపర్కం. అనునయాన్ని రానివ్వకుండా చేసేసింది.

దాంతో మనస్సే మారింది కూడాను. అప్పటినుండి యేపని చేసినా, ఈ స్థితిలో 'మామగారుండివుంటే ఎంతదర్జాగా చేస్తారు! ఎంత హుందా చూపిస్తారు?' అన్నదృష్టిలో ప్రతీ చిన్నపనిని సమీక్షించి, ఆచరణలో పెట్టడం అలవాటైంది. ఇదివరకు పావలాతో చేయించినపని, ఈరోజు రూపాయిన్నర ఖర్చు అవడంతో ఆఖరవసెంతల్లా, జరిగేక్రియ ఒక్కటే అయినా, ఓ గొప్ప వైభవం వాట్లకి ఆపాదించడం అనే మైపూతలో, అత్తవారితో సమాన ఫాయిదాలోకి తనూ చేసేడు, చేయించగలడు అన్న గర్వం వచ్చేది.

దీనికితోడు భార్య సుబ్బులక్ష్మి ఆ, ఆ, సమయాల్లో "మా నాన్నగారు కూడా ఇల్లాగే చేసేవారు" అనడంతో శరీరం మొలామూ చేసుకునేవాడు మంగేశ్వరరావు.

కాపురానికి వచ్చినప్పటినుండి సుబ్బులక్ష్మిని చూస్తూనేవున్నాడు. ప్రతీ చిన్న గృహకృత్యంలోనూ ఓ ప్రత్యేకతరహా కన్పడేది. ఆఖరుకు కామెర్లకళ్ళకి ప్రపంచం పచ్చగా కన్పడుతూవుంటుం దన్నట్లే నడకలో, చీరకట్టులో, రవిక తొడుక్కునే విధానంలో, పాంజేబుపట్టాల ధ్వని, ఒక్కటేమిటి అన్నిట్లల్లోనూ ప్రత్యేకతే కన్పించేది. ఎల్లాగైనా కాచివడపోసిన బంగారం అది అన్న నిరుకులోనూ పడిపోతే, అక్కడ వొదినావుంచి, నల్గురైదుగురు పిల్లల్తో వాళ్లందర్నీ గాలికి, ధూళికి వదిలేసింది. తనవాన్నా ఒక్క విషయంలో ప్రత్యేకత చూపించదు. ఏదో సత్రంలా వుంటుంది యిల్లు - అన వరసలో ఆలోచనలు సాగించేవి. దాంతో ఎంత ఏహ్యంగా వుంటాదో అనిపించేది. తను అల్లాంటి వాతావరణంలో పెరగవలసివచ్చింది, పెరిగేను అన్నది తలచుకుంటూనే ఉగ్గపాలతో తేమల్దం ప్రారంభించేది. ఎల్లాగైనా మామగారే ఇవ్వాలి క్రమశిక్షణ అన్న ఆరాధన, దాంతో సుబ్బులక్ష్మికి గృహిణికంటె, నెత్తిమీద దేవత అన్న స్థానం వచ్చేసింది, తెలియకుండానే. అది ఇచ్చేదు కూడాను మందేశం.

ఆ రోజుల్లో నెలకు కొద్ది రూపాయిలు వచ్చే జీతం సరిపోదని, ఇంకోదానికి దరఖాస్తు పెట్టేడు. అటు ఆ దరఖాస్తు పోస్టులో వెయ్యడంతో, ఇటు మామగారికి, ఇల్లా తెలియపరిచేడు. నెల తిరక్కుండానే,

అర్డరు రావడంతో, ఏదో తెరవెనుక మామగారు తిప్పక చేసేరు, అందువల్లే ఉద్యోగం వెంటనే అయ్యింది. అన్న విషయం, ఇక మామగార్కి నివాళి పట్టేంతటి ఆరాధనలోకి వెళ్ళింది. కూర్చుని అందరికీ ఈ విషయానికి చిలవలూ పలవలూ అల్లి ఉత్తరాలు వ్రాసేడు.

దీంతో ఇటు ఖర్చులు పెరిగేయి అటు వచ్చే రాబడి సరిపోక పోవడంతో కొత్త అన్నగారు ఏమైనా నెలనెలా, పొలాల మీదవచ్చేశిస్తు, తనవాటిది, పంపిస్తే బావుండును అన్న ఆలోచన వచ్చింది.

యథాలాపంగా ఆ రాత్రి సుబ్బులక్ష్మితో ప్రస్తావించేడు.

“అవును. ఇన్నాళ్ళనుండీ బెల్లంకొట్టిన రాయిల్లా మాటాడక, వూరుకున్నారు. దాంతో దమ్మిడీ దక్కనివ్వకుండా ఆయన స్వాహాః చేసేడు. వాటాలు పంచమనండి” అంది.

ఇన్నాళ్ళూ అన్నగారంటే భక్తితో బాటే భయం కల్పరుని ఉన్నవాడు, ఈ ఒక్క ముక్కలో చెప్పిన తాత్పర్యాన్ని గ్రహించి, అమల్లో పెట్టడం అసాధ్య సాధ్యాల మధ్య తికమకలాడి ఏమీ మాట్లాడలేకపోయేడు.

సుబ్బులక్ష్మి క్షణికంలో గ్రహించినట్లే ఈ ఎగతీత దిగతీతల ప్రవృత్తిని, “మా నాన్నగార్కి ఉత్తరం వ్రాయండి. ఆయన ముఖాముఖీగా, కరాఖండీగా, అమీ తూమీ తేల్చేస్తారు. అంత మౌనంగా వుండబట్టే ఈ సంసారం ఇల్లావుంది” అని ఈసడించినట్లే అనేసింది.

చురుక్కుమంటే, గబగబా వెళ్ళి మామగార్కి ఓ పెద్ద వుత్తరం వ్రాసేడు. ఆఖరుగా “ఇల్లా ఇన్నాళ్ళనుండీ, మా అన్నగారు తన ఆధ్వర్యంలో పొలాలవిషయం నాకు తెలియకుండానే వ్యవహారాలునడిపేరు. నావాటా నా హక్కు, నాకువచ్చే ఆయివేజు ఎంతో తెలియకుండానే ఉంచేరు. ఇప్పుడు ఇంక మూగగా వుండడంలో నా బాధ్యత లేదు.

ప్రపంచానుభవం కలవారు, వ్యవహారాలన్నీ మీకుకరతలామలకం, మీరు యిందులో కొస్త జోక్యం కల్గచేసుకుని, ఏదో విధంగా పరిష్కారం చేసి, రిజస్టరీ చేయించమని కోరుతున్నా. శ్రమకు అన్యథా భావించరని ఆశిస్తున్నా” అనీ వ్రాసేడు.

పోస్టులో వేసినప్పుడే - తన కాళ్లమీద తను నుంచునేవరకూ, అన్నయ్య, వదిన యెన్నో చేశారు. ఆఖర్కు వాళ్ళ సదుపాయాలు కొంతవరకైనా త్యాగం చేసేరు. అల్లాంటి వాళ్ళమీద నే కత్తిదువ్వడానికి సిద్ధం అయ్యేవు. అందులోనూ, నడమంతరంగా వచ్చిన మామగారి అండ చూచుకుని--అన్న సత్యం యెత్తిపాడిస్తే, కుమిలింపు పొందేడు.

అత్తిల్లు, పుట్టిళ్ళమధ్య త్రాడుమీద తనో దిష్టిపిడతేమో అనీ అనిపించింది.

గుమ్మం యెక్కేసరికి సుబ్బులక్ష్మి కోర్టు వ్యవహారాల్కి వచ్చిన రైతుతో “ఆయన్ని వాజమ్మక్రింద జమచేసి, ఇన్నాళ్ళూవచ్చిన శిస్తు గుటకాయస్వాహా చేసేసేరు ఇంక సాగవు అనిచెప్పు. ఆస్తిపంపకం వెంటనే జరిపించాలని, దానికి మధ్యవర్తిగా మా నాన్నగారు వుంటారని కూడా వాళ్ళకి నొక్కి చెప్పు” ఆవరపలో ప్రదర్శనం ఇచ్చేసింది.

వాడు పెట్టిన దండాలు అందుకున్నట్లే చెయ్యివూపి, తను యెంతవరకూ వాజమ్మ అయ్యేడు, అన్న ఆలోచనలోనే, నూతిమీద చేద, గిలకమీదనుండే లోపల్కి దించేడు. పరధ్యాన్నంలో మళ్లీ త్రాడు చేదేడు, బాల్చీలో నీళ్లు మునిగేయో లేవో కూడా చూడకుండానే. ఉత్తిబాల్చీ వచ్చింది.

* * *

భూమి పంపకాలవిషయం ఏరోజునుండి భార్యకు చెప్పేడో ఆరోజునుండీ ఏదో ఓ సమయంలో అన్నగారు, వదిన గారువాళ్ళఇంట్లో నడచిన ఉమ్మడి వ్యవహారపు రోజులు గూర్చి ప్రస్తావన తీసుకురావడం, తను చెప్పిన సమాధానాలకు అర్థాలుతీసి, వాళ్ళు చేసిన కుట్రలు అనేట్లు ఎత్తిచూపించడం సుబ్బులక్ష్మికి ఓ దినచర్య అయ్యింది. ఈ సమీక్షలనన్నిటిని నోరుమూసుకు వినడం మందేశ్వర్రావుకు అలవాటు అయ్యింది.

ఇది అలవాటే అన్నది సత్యం అయినా, సుబ్బులక్ష్మి చెప్పిన విషయాలన్నీ కూడా బేసబబుగా లేవన్నట్లు కన్పడేవి. దాంతో ఇన్నాళ్ళూ తను కళ్ళుమూసుకు కూర్చున్నాడు అని ములుకర్ర పొడిచినట్లయితే, “మామగారు వస్తారు. పంపకం అవుతుంది. అయ్యింతర్వాతనే, ఇన్నేళ్ళూ ఆస్తిమీద వచ్చిన శిస్తుకు జమాఖర్చులకు నోటీసు ఇప్పించాలి” అన్న ఆలోచన క్రమ్మేది.

దాంతో అన్నయ్యపని అవుతుంది. వదిన గారిమెళ్ళో కట్టకాసుల పేరు అమ్ముకొంటాడో, రెండణాల బిళ్ళమీద సాక్షుల్తో సంతకం చేస్తాడో చూస్తాగా. అని ధీమావచ్చేది.

దీంతో సంతోషమూ తను అన్నగారి మీద ఒక భిన్నం జయించేసేనను అన్న గర్వు పొడిస్తే, రెండుచెండ్లు మల్లెపూలు, వాట్లకి డాకురేకు చుట్టబడివున్నవే, మార్వాడీకొట్లో కాజాలు, జీడిపప్పు, పకోడీలుకొని, ఇంటికి పట్టుకువెళ్ళేడు.

పుచ్చపువ్వులా అంది పుచ్చుకుంటూనే “నాన్నారు ఉత్తరం వ్రాసేరు. మీ అన్నగార్కి పెద్ద ఉత్తరం వ్రాసేరుట. జవాబు చూచుకుని తానే బయల్దేరి వస్తారుట...” అంది.

“నిజంగా?” అంత వెనువెంటనే ఆయన కదనరంగంలోకి దిగుతానన్నది సంశయాత్మకంగానే వుండిపోవడంవల్ల, ఆశ్చర్యంలో అడిగేడు.

ఉత్తరం చేతులోపెట్టి “మా నాన్నతో వ్యవహారం ఏమనుకున్నారు. మీ రన్నట్లుగా తేభ్యం అనుకున్నారా ఏమిటి?” అన్న చూపులూ ప్రదర్శించింది.

మందేశ్వరం నాల్గుసార్లు చదివేసు ఆ ఉత్తరాన్ని గోడకు ఆనుకుని, కుర్చీలో కూలబడీ, కొస్త కాళ్లుజాపి నడుంవాల్చి, ఆఖర్కు బిగిసిపోయి, భక్తి, గౌరవం యెక్కువైపోతే, ఉత్తరమే మామగారు అన్న భావప్రకటనల్తో చదివేడు. చదివిన కొలదీ క్రొత్తకారణాల్లో మామగారు దివి నుండి భువికి దిగిన దేవత అన్నది ఇనుమడించింది.

పువ్వులు తురుముకుని, కాఫీ తెస్తూనే “మీ వొదినగారు, పెద్దాడిని, ఆడపిల్లని పంపించింది,”

“ఎందుకూ?”

“వాళ్ళింటిలో సత్యనారాయణ వ్రతం, వెంకటేశ్వర దీపారాధన చేసుకుంటున్నారట. భోజనానికి.”

“ఎప్పుడూ?”

“ఎల్లుండి.”

“అయితే వెళ్ళాలేమో!”

“ఎల్లా వెళతాం? ఆదివారంనాడు మా చెల్లెలు కొడుక్కి పుట్టువెంట్రుకలు తీయిస్తారట. మనం అందరం వెళ్ళకపోతే నాన్నారు ఊరుకుంటారా? చెల్లెలు మనస్సు కష్టపెట్టుకుంటుంది.”

“మరి...?”

“మీరు ఆఫీసుకి శెలవు పెట్టండి. నాన్నారికి ఉత్తరమూ వ్రాయండి మేం అంపగం శనివార సాయంకాలం కోచీలో వస్తున్నామని...”

“వాళ్లకు...” అనలేక అన్నాడు.

“ఉత్తరం యెందుకూ? మాట్లాడక వూరుకుంటే సరిపోతుంది.”

బాధ కల్గింది. తను అక్కడ వుండే రోజులలో, ఇంట్లో ఏశుభం వచ్చినా, మండపం కట్టించడం, తోరణాలు, పందెళ్లు పరదాలు ఊళ్లోకివెళ్ళి పాలు, పెరుగు, కూరగాయలు తెప్పించడం, ఆఖరున కూరబుట్ట పుచ్చుకుని వడ్డించడం కూడా తన ఆధ్వర్యం

# ★ మధ్య దూరం ★

క్రిందట యింతో కంజాయింపుగా జరిగేది. తిరుబడే వుండేది కాదు. గంటలు జరిగినా ఆ ఇంట్లో ఆ రోజుల్లో తనకో ప్రత్యేక స్థానం వుండేది. పైగా "ఒరేయ్! మందేశం. అంతా నీమీదనే పెడుతున్నానోయ్. ఏం చేస్తావో" అని అన్నగారు పెదిమలు కదల్చకుండానే అప్యాయంతో, తన బాధ్యత గురుతరంగానే వుండేది.

ఈ నాడు! ఇవన్నీ అన్నయ్య చేసుకోగలుగుతాడా? ఇంటి పేరు నిల్పుకొని సంబాళించుకోగల్గుతాడా? అంది వచ్చిన కొడుకులు కూడా లేరాయె! అన్న ఆవేదన కల్గింది. తనేనా వెళితే ..

ఆ ఇంటికి వెళ్ళడానికి ఒకళ్ళను అడగక్కర్లేదు ఎప్పుడు వెళ్ళినా ఆహ్వానిస్తూనే వుంటుంది వదినగారు మీగడతో, ఆవకాయ అన్నం పెడుతుంది అన్నయ్య కళ్ళల్లోంచి నవ్వుతాడు ఈ రోజు తనే దూరం అయ్యేను అనిపించింది. దీనికి కారణం ఎవరూ అన్నది ఆలోచించడానికి ఆ మతి చాలటం లేదు

లోకం పోకడే ఇంతే అని సమాధాయింపు కూడా అతుకుల బొంత అవుతోంది. వదినా, పెళ్ళాంబిడ్డలు, ఇవిరావిపెంతో తన్నవాళ్ళకు దూరం అవాలని, ఏ చరిత్రలోనూ వ్రాసి లేదు; వ్రాసివుంటే అది వంశ పారంపర్యా వచ్చే కథల్లో ఒకటి అనుకుని తృప్తిపడడానికి, ఏ విధంగానూ అనుభవంకు ఆధారం కన్పడటం లేదు

ఆ ఆదివారం భార్యాబిడ్డల్తో అత్తవారింటికి వెళ్లి వచ్చేడు అన్నగారిక్కి ఉత్తరమైనా వ్రాయకుండానే ఉన్నాడు. మామగారిచ్చిన శేలం అంచు జరీచాపులో, ఈ అన్యాయం దాచుకుందామనుకున్నా, అది జల్లెడలోంచి చూచినట్లే అంచులు మెలామా చేసింది.

వచ్చేటప్పుడు కూడా మామగారు అన్నగారి ఉత్తరం ప్రకారం ఆ వూరు వెళ్లి, మూడోరోజు సాయంత్రానికి ముసాయిదా వ్రాసి తెచ్చేడు తర్వాత ఆ సబురిజిష్ట్రారు ఆఫీసులో అది రిజస్టరి అయ్యింది. దస్తావేజు పై సంతకం పెట్టుతున్నప్పుడే, కళ్ళు చెమర్చాయి తన తాత, తండ్రి, అన్నగారు తనూ ఈ వంశాల అనుక్రమణికలో లోకం ఎంత మార్పు తీసుకు వచ్చిందో, తనే దీనికంతా కారణం అనీ తట్టింది.

బయటకు వస్తున్నప్పుడే "అన్ని శిస్తులు కూడా రేపు విజయదశమికి ఆఖరు అయిపోతాయి నీ పేరు గ్రామ లెక్కల్లో పట్టా మార్పు చెయించమని కరణంతో చెపుతాను. నీవంతు ఏభై వేల ఇటికా అమ్మకం పెట్టుకోవచ్చు నీవాటాలో వుంటున్న స్కూలు మాస్టరుతో అద్దెవిషయం నిర్ణయం చేసుకోవచ్చు ఇంతవరకూ అతన్ని ఊరకనే అద్దె లేకుండానే వుండమన్నాను" అని అన్నగారు అప్పగింతలుగానే చదివేరు

ఈ నీ, నా లు తలవంచుకునే విన్నాడు ఒక్కొక్క విషయం ఒక్కొక్క పెద్ద బరువు తనమీద పెడుతున్నట్లు తట్టింది, ఈ అనుభవం లేని జీవితంలో ఒకే వంశంలో రక్త స్పర్శతో పుట్టినప్పటికి, ఈ నాడు ఈ భాగాల తెగ తెంపులో, జీవితాలు కూడా వేరైనట్లే బాధపడ్డాడు.

ఆరోజు మనిషిగానే వుండలేక వ్యథపడ్డాడు. గుండెలస్పందనం ఉధృతంగా వస్తే మనసారగా ఒక్కసారి యెలుగెత్తి ఏడ్వాలనిపించింది

తను, తన వ్యక్తిత్వం ఆదర్శం ఈ నాటి పూర్తియెడబాటు యెల్లావున్నా, సుబ్బలక్ష్మిమాత్రం, పరాయి దుష్ప్రభుత్వాల బారినుండి, తమ సంస్థానాన్ని స్వతంత్రంలోకి తెచ్చుకున్నట్లు, ఏలినాటి శనికి ఉగ్ర జపహోమాలు చేయించి శాంతి కల్గజేసినట్లు సంతోషపడింది

"మా నాన్నగారు ఉండబట్టే, నా డబ్లీ, ఏం కోర్టులకు లాగుతారో అన్న భయంవల్ల మీ అన్నగారు ఒప్పుకొన్నారుగాని లేకపోతే. విజయదుందుభి మ్రోగినట్లే అంది కళ్లెప్పగించి చూచేడు

"శ్రమనమాత్రం, యీ మూడు రోజులూ హోరాహోరీగి వాగ్వాదాలు చేశాముట చాలా గట్టిపిండం మీ అన్నగారు అన్నారు నాతో..."

చిరునవ్వు తెప్పించుకోవాలనుకున్నా, అది రాలేదు.

"అయినా..." ప్రశ్నార్థకంలో ఆగి చూచింది.

మందేశంకు ఈ అసంపూర్తి ప్రశ్నను అర్థంచేసుకుందుకు, ఓపా పని చెయ్యలేదు దాంతో 'ఏమిటీ' అన్నట్లు కళ్ళతోటి చూచేడు.

"పాత బకాయిలను గూర్చి మాట్లాడకుండా వూరుకోవడం ఏం బావోలేదు"

ఎంపెదెబ్బ కొట్టినట్లయింది.

ఇదే ప్రశ్న, అగ్రస్థానంలో భోజనాల దగ్గర మామగారు కూర్చుని, ఆరాత్రి వేసేరు పునః.

"ఇప్పటి ఉజ్జాయింపు ఆదాయం ప్రకారం మనం లెఖ్ఖలుకట్టినా, నీకు ఆయన ఇంకా నాల్గయిదు వేలు పైగా బాకీ పడతాడు.." అని వాళ్ళమ్మాయి వైపు చూచేడు

"అబ్బో! అంతే ..! నేను చాలా రోజులనుండి అనుకుంటున్నాను; ఓపదిపన్నెండు కాసులు పెట్టి చంద్రహారం చేయించుకోవాలని ఇన్నాళ్ళూ మెడ బోసిగానే వుండిపోయింది పైగా పెద్ద అమ్మాయికి ఒక్క పేట సన్న గొలుసు, రెండు జతల గాజులైనా చేయించాలి; ఎదుగుతున్న పిల్ల ..' అని తండ్రివైపు చూచింది

ఆయన మందేశంవైపు హేళనగా చూచినట్లే చూచి నవ్వేసేరు.

కడుపులో చెయ్యి పెట్టి కెలికేసినట్లే అయ్యింది మందేశాన్కి తట్టుకోలేక కోపమూ వచ్చింది ఇంకోడైతే ఆ మామ గారి ముసలి తలకాయ పట్టుకుని "ఓరి ముసలి నక్కా నీకెందుకురా" అని గోడకు నాల్గైదు సార్లు తింగుననిపించాలన్న ఉక్రోశం వచ్చేవుండును. కాని దాన్ని దిగమ్రింగుకోవలసి వచ్చినట్లే మ్రింగుతూ

"ఏంచేద్దాం అంటారు?" అన్నాడు.

"దావావెయ్యాలి." అంది ముగ్ధ సుబ్బలక్ష్మి

"అది మంచిపద్ధతే" అని నీళ్ళు నమిలినట్లుగా తలవూపేసేడు.

"ఖర్చే అవుతుంది. జప్తునోటీసు జారీ చేస్తారు అమీనా వచ్చి జప్తు చేస్తాడు తర్వాత వేలంపాట. అందులో అన్నయ్య కొన్నవన్నీ కూడా మనం పాడేద్దాం దాంతో ఇన్నాళ్లు నన్ను పీల్చి పిండిచేసినందుకు ప్రతి క్రియ చేసినట్లవుతుంది. వదిన మెళ్లోవి తీయించి తను గొప్పవాడు అవుతాడు కూడాను. ఏమంటావు సుబ్బూ!" అన్నాడు మందేశం. ఆ అనవసంలోనూ, అతి నెమ్మదిగా, శాంతం మూర్తీభవించినట్లే, మాట తొణకకుండానే అన్నాడు

ఒక్కసారి తండ్రీ కూతుళ్ళిద్దరూ నోరు తెరిచేసేరు. తేరుకుని ముసలాయన "ప్రపంచానుభవం నీకేం తెలుసు? ఇంకా కుర్రాడివి. అన్నీ కూడా మనస్సుకు అంత ఎక్కువగా పట్టించుకుంటే, మనం జీవించలేమోయి!" అని ఉత్తర పరిషేచనం చేసి లేచేరు.

ఈ మాటల ధ్వని సుబ్బలక్ష్మికి తుప్పాక తగిలితే, నోరు కుట్టేసుకుని మూగ ముత్తైదువే అయ్యింది.

"ఎల్లా అర్థం అయేటట్లు నీకు చెప్పగలను అన్నయ్యా" అని ఆరాత్రి చాలా సేపు నిద్రపోకుండానే ఆలోచించేడు.

మర్నాడు సాయంత్రం రైలు ఎక్కించే ముందు శేలం అంచుజరీచాపు పెట్టి వంగి నమస్కారం పెట్టేడు మందేశం మామగారిక్కి.

* * *

ఆనాటి రాత్రి జరిగిన సంఘటనను సుబ్బలక్ష్మి మర్చిపోలేకపోయింది. ఇన్నాళ్ళూ తన భర్తను చేతగ్గని ముదివేసుకున్నానని విర్రవీగింది. అల్లా అక్కచెల్లెం



విశాఖపట్టణం హార్బరు —ఫొటో. కని మెరకల రామారావు, విశాఖపట్టణము

ప్రతో చెప్పకని డాబు ప్రదర్శించింది. విశ్వాసాన్ని కూడా తను ఒక్క మిథ్యా ప్రపంచంలో వున్నట్లే అయ్యింది తన దిర్ఘ ఇంతి న్యూనత్వ, కించపరుస్తాడని అనుకోలేదు పైగా గీచిన గీటు దాటని పరిసరాల్లో కట్టుకున్న అంతస్థులు అన్నీ పేకముక్కల మేడవలె అయితే భరించుకోలేక పోయింది.

తక్కిన రోజుల్లో ఈ కోపాన్ని పైకి కనపడేట్లే ప్రదర్శించింది ఆఖరుకు ఆయన తెచ్చిన మల్లిపువ్వుల్ని కూడా తలలో తురుముకోకుండానే, చింపిరి జుట్టుతోనే కన్పించింది మాట్లాడ్డం, అదేవా ముక్తసరిగానే జరిపించింది.

ఈ పదిరోజులనుండీ చేస్తున్న తరప మాస్తానే వూగుతున్నాడు ముందేశం. తన దృక్పథంలో ఆమె చూడలేదు. చూడానికి కనీసం ప్రయత్నించదు. అల్లా చెప్పడం కూడా వ్యర్థం అని తెలుసు. అయినా తను క్రియాత్మకంగా ఏమీ చెయ్యలేని విస్తే ప్రతి వచ్చేది.

తీరా వుంటుంటే మామగార్కి, తను ఇల్లా చేస్తున్నాను అని ఏమైనా వుత్తరం వ్రాస్తుంటేమో అన్న భయం పీకింది దాని వల్ల అటు ఆయన దృష్టిలో కూడా, తక్కి స్వార్థపరుడు, స్వాభిమానం అన్న భావం ఏర్పడుతుంది అన్నది బాధపెట్టేది ఆయన యా

# ★ మధ్యదూరం ★

వుత్తరం ఆధారంగా తన్ని కొస్త దూరంగా వుంచితే, ఆ క్రొత్త స్వతంత్రంలో తాను ఆగలేదు. ఇప్పటికే ఉక్కిరిబిక్కిరి అయిపోతూ వున్నాడు. రూపొందితే ఏకాకి అయిపోతాడు.

అందువల్ల ఏదోవిధంగా, సంధి చేసుకోవాలనుకుని, ఎన్నో మార్గాలు ఆలోచించేడు. ఒక్కటీ అతికినట్లు కన్పించలేదు. ఆరోజు తన ఆఫీసు సహకార సంఘంలో ఆరువందలు రూపాయలు అప్పు పెట్టి, వాటితో పది సవరనులూ కొని తీసుకువచ్చేడు.

దారిలో పువ్వులూ, మిఠాయికొన్నాడు.

పెద్దమ్మాయిని పిల్చి, అవన్నీ చేతులో పెట్టేడు. "తీసుకు వెళ్ళి, మీ అమ్మకు ఇయ్యి" అన్నాడు.

రోజూ మిఠాయి, పువ్వులూ అందుకోవడం అలవాటే అయినా, ఈనాడు వాటికి తోడు పది సవరనుల గుర్రపు మార్కు కాసులూ మెరిసిపోతే, ఒక్కసారి నవ్వు పొట్టే అయిపోయి, బ్రిడ్జిగాజులు జత, మిరియాల జడివొకటి, పలకబిళ్లల గొలుసు, జూకాలూ, చేయించుకోవాలి అన్న సంబరంలోనే వంటింట్లోకి పరుగెత్తింది.

"అమ్మా! నాన్నగారు నీకుఇమ్మన్నారే"

"దేవుడిగూడు దగ్గర పెట్టు."

"పువ్వులు ఒక్కటే కాదే. ఇవ్వాళ..."

"ఏమిటేదీ!"

"బంగారంకూడా తెచ్చేరే!"

"ఏమిటీ" అంటూనే లేచివచ్చింది.

"మరి నాకేం బ్రిడ్జిగాజులు, పలకల గొలుసు..."

"ఇల్లా ఇయ్యి ముందు"

చేతిలోంచి పూల్లాక్కున్నట్లే తీసుకుని లెక్కపెట్టింది. అవి మెరిసిపోయేయి. గబగబా దువ్వెన్నతో ఇటు, అటూ సవరించుకుని, స్వహస్తాల్తో కాఫీ ఫలహారాలు పట్టుకువెళ్ళింది. ఆయన్ని ఈ వారంరోజులు దూరంగావుంచి, ఎంత బాధపెట్టేనో అన్న కుమిలింపు, అందులో దుఃఖం కల్గితే, గుమ్మంనుంచి ఒక్కడుగులోనే కుర్చీదగ్గరకు వెళ్లి

"అల్లా తలపట్టుకున్నారేం! తలనొప్పిగా లేదుకదా!" అంది. పమిటిచెంగు పెట్టి లేదని ఊపిన నుదుటిని తుడిచింది.

"వాళ్ళ ఆచార్లుగారి అమ్మాయికి నూడిదలు తెచ్చేరుట. మిఠాయి వగైరా పంచిపెట్టేరు...ముందు కాస్త కాఫీ తీసుకోండి"



క్షుద్రదేవత ప్రత్యక్షమైనట్లేతట్టింది. మాట్లాడకుండానే త్రాగేడు. గుమ్మందగ్గర నాన్నగారైనా కనీసం తనవు తీరుస్తారేమో అని ఆశిస్తూవున్న కూతుర్ని పిలుస్తూనే, "వాళ్ల నాంచారమ్మకనకాంబరపు పువ్వులు ఇస్తానంది. వెళ్ళి తీసుకురా" అని పురమాయించింది.

అడుగుల్లో అడుగులు వేసుకుంటూనే అమ్మాయి వెళ్ళింది.

వెనువెంటనే చెంగుకొంగు అడ్డంలోనే ఎక్కిళ్ళమధ్యనే "నేనేం చేసేనని ఇల్లా కోపగించేరు? మా నాన్నని, అమ్మని అందర్నీ ఒదిలిపెట్టి మీరే అన్నీ అనుకుంటే, ఇల్లా ఏడిపిస్తే బావుంటుందా? తలకొాయి తీసేసినట్లే వుంది నాకు..." ఆ వరసలో రసవత్తరఘట్టంలో మొదలు పెట్టింది.

అనుకున్నది, ఎదురుచూచింది ఒకటి. తీరాజరిగింది ఇంకొకటి. తట్టుకోలేక, రెండు చేతుల్లోకి తీసుకుని ఊరడించడం మొదలు పెట్టేడు మందేశం.

ఆ రాత్రి...

"అన్నయ్య పంపేడు. దాంతో కొన్నాను..." అని చెపితే ఊగిపోయి వెర్రులెత్తించింది.

మర్నాడు సుబ్బులింగాన్ని పిల్చి, పిల్లకు గొలుసు, తనకు రెండుజతల గాజులు పురమాయించి బంగారం ఇచ్చేసింది.

* * *

"నువ్వు మీ అన్నగారివద్దనుండి వాయిదాల్లో, గత శిస్తుబాపతు వసూలు చేస్తున్నందుకు చాలా సంతోషం. పైగా అమ్మాయికి బంగారం కొనిఇచ్చేవన్నందుకు సంతోషం.

పెద్దవాడిని చెప్పాల్సిన బాధ్యత నామీద ఉంది కనుక, కొంత కాకపోతే కొంత అయినా నువ్వు ఇప్పటినుండి వెనుక వేసుకోవాలి. అమ్మాయి పెరిగి పెద్దదవుతోంది. దానికి ఇప్పటినుండీ సంబంధాలు చూడ్డం మంచిది." అన్న మామగారి ఉత్తరం వచ్చింది. ఈ వరసలో వస్తుందనుకున్నా తన కూతురు పెళ్ళి విషయంలో, చురుగ్గా వ్రాయడంతో, ఓ వింతైన ఆశ కల్గింది. దాంతో ఆశయాలు చిగిర్చేయి.

ఉత్తరం మరోసారి సుబ్బులక్ష్మికి చదివి వినిపించేడు.

"ఎందుకు వ్రాసేరంటావు?"

"త్వరగా ఆయన దగ్గరనుంచి, ఈ పేరు మీదుగానైనా వసూలు చెయ్యమని" అంది.

గుండెలు తడబడ్డాయి. క్రమ్ముకుంటూనే "అదికాదే ఆయన ఉద్దేశ్యం?"

"మరేమిటేమిటి?"

"ఏం లేదులే! అయినా అది తర్జుభారంఅనుకోవటం లేదు.

అయినా ఇంకా ప్యాసుకాలేదు. ఇప్పనుండీ పెళ్ళిగొడవ ఎందుకు?" అని దప్పరించేడు తను మొట్టమొదటనే ఆ విషయం బయటపెట్టడం ఇష్టంలేక. పెట్టినందువల్ల అవహేళనకు గురిఅవుతానేమో అన్న పిరికితనంలోనూ.

"ఎందుకైనా మంచిది. ఏమైనా మీ ఎరికలోవుంటే చూస్తూవుండమని వ్రాయి" అని నమిలేసేడు.

ఇల్లా యెందుకన్నారో అర్థంకాక తికమకపడింది. ఏదో మాటలసందర్భంలో మేనరికాల గొడవలువస్తే, తక్కున స్ఫురించినట్లే "మా తమ్ముడికి చేసుకుంటే బాగానే వుంటుందికదూ?" అనేసింది.

తలూపి నవ్వేసేడు. పెద్దవుత్తరం తండ్రిగారికి వ్రాసింది. వారంరోజుల్లోనూ ఒప్పుకుంటున్నామని ఉత్తరం వస్తుందనుకుని యెదురుచూచింది. రాకపోవడంతో రైలు యెక్కేసింది.

"అమ్మాయి. సంబంధం కలుపుకుంటే మంచిగానే వుంటుందికాని, వాడింకా ఇంటరేనా పూర్తిచెయ్యలేదు. ఇప్పటినుంచే పెళ్ళి చెయ్యడంలో అర్థంలేదు..." అన్నాడు.

కోపంవచ్చింది. వెనువెంటనే అంతస్థుల తేడాకూడా స్ఫురించింది. బాకు పోటు పొడిచినట్లే బాధపడి, ఆ రాత్రిబండికే తిరిగి వచ్చేసింది.

* * *

అంతవరకూ వెళ్ళినవయస్సులో పెండ్లి సంబంధాలు చూడ్డం, అన్న విషయంలో అనుభవం ఓనమాలు చుట్టలేదు. మామగారు ఎడంచెయ్యి చూపించడంలో, కొలికం పెట్టినట్లే మండుతుంటే, ఎల్లాగైనా సంబంధం నిశ్చయం చేసెయ్యాలన్న పట్టుదలా హెచ్చయ్యింది. దాంతో స్నేహితులు అందరికీ ఉత్తరాలు వ్రాసేడు.

అలవాటుప్రకారం, ఎప్పుడూ పిల్లతండ్రి పెళ్ళివాళ్ళను పిల్లను చూచుకోడానికి రావలసిందని పిల్వరు. దీంతో తనకు కనీసం చేతికందివచ్చిన కొడుకైనా లేకపోవడం అన్న ఆరాటనా కల్గింది, ఇంక గత్యంతరం లేనట్లుగా, అన్నగార్ని పెద్ద చెయ్యవలసి వచ్చింది. ఆరోజు ఆయన్నిపంపే ప్రక్కవూళ్ళో వారి అబ్బాయిని రమ్మని కవురు పెట్టేడు.

ఇంతలోపల రాద్ధాంతాలు జరిగినతర్వాత అన్నయ్య, తన కార్యాల్లో చెయ్యి కలుపుతాడా అని అనుమానపడి, సమస్యలు పెంచుకున్న విషయం, చాలా హాస్యాస్పదం అని నిరూపింపబడడంతోటి తలవంపు కల్గినట్లే అయ్యింది. అయినా సాంప్రదాయానుసారం ఆయన వచ్చేడు అని అనుకోవడం

ఆఖరుక్కి ఆ తాంబూలాలు పుచ్చుకుని, కట్నం, లాంఛనాలు ఇచ్చి పుచ్చుకోడాల దగ్గర మామగార్ని పిల్చి, అన్నగార్ని వెనుక్కి తోసేసేడు మందేశం. మామగారు, భోజనాల అనంతరం, 'మనం అనుకున్నవన్నీ కాగితంమీద వ్రాసుకుంటే మంచిదేమో!' అని అనడంలో, ఆయన ప్లీడరీతనం అంతా, ఎంత గొప్పదో అనుకున్నాడు. ఆయన దూరాలోచనకు మురిసిపోయేడు

వియ్యంకుడు మొఖంలో నెత్తురు చుక్క లేనట్లయ్యింది

ఇంటికి వచ్చేటప్పుడు రైల్లోనే "నీకూ కున్నీ, కాగితాలు, లాపుస్తకాలముఖ్య, సాక్ష్యాల్తో, అమ్మి, కొనుక్కొని పెండ్లిచేసేవని విర్రవీగుదామనుకుంటున్నావు కాదూ?" అని టోకాయించినట్లయితే త్రుళ్లిపడ్డాడు.

మామగారిమీద వెళ్ళగ్రక్క లేని కోపం వచ్చింది. మానవత్వం అన్నది, పెళ్ళిళ్ళు డబ్బు కాగితాల్తో కాదు, ప్రేమ, అనురాగాల్తో చెయ్యాలి అన్న ప్రాథమికసూత్రం తెలియని ఈయన్ని దుమ్ముదులిపెయ్యాలి అన్న ఆవేశమూ కల్గింది.

దాంతో నే "అన్నయ్యేవుంటే..."

నిజం! అన్నయ్యేవుంటే, ఇంతనైతిక పతనం కాకపోను తను.. ...

కాని అన్నయ్యను తనే దూరం చేసుకున్నాడు. దానికి కారణం...ఆలోచించడానికి మనస్సు కించపడింది.

* * *

విఘ్నేశ్వరుడికి మొదికటినప్పటినుండి చూస్తూనే వున్నాడు, అన్నయ్య, కొడుకులు, వాళ్లవూళ్లోంచి తెచ్చిన పరివారమూ చేసేపని, అన్నయ్య గతం మర్చిపోయి, ప్రస్తుతంలో, తన వంశప్రతిష్ఠలు, కుటుంబ గౌరవం అన్నీకూడా, ఏమాత్రం ఆదమరుపుగా వున్నా. అవి మంటకలిసిపోయి తలవంపులు వస్తాయి రేపు పదిమందిలోనూ తలెత్తుకోలేం అన్న జాగ్రత్తలోనే అవన్నీ జరిగేయి. రోజురోజుకూ ఎన్నో పనులు, ముందు వెనకా ఆలోచించి, చేసేసినవి చిఠాల్లోకి ఎక్కిపోయేయి

ఆవిడా, మందేశంకూడా వెళ్ళి ఇంకా పదిరోజులుండగానే మామగారు కూతుళ్ళు అల్లుళ్ళతో వచ్చి చెయ్యి సాయం చేసేసి, పెళ్ళంతా విజయవంతం చేసేస్తారని ఆ రోజుల్లో చాలాసార్లు అనుకున్నారు కాని ఏ రోజుకారోజు రైలుకువెళ్ళి తిరిగి రావడమే మిగిలిపోయింది.

ఇంక రెండు రోజులుండగానే బండిలో ఇంటరు చదువుతున్న బావమరిది, వాడిపై వాసు వచ్చేరు. వచ్చీరావడంతోనే వంటవాడిదగ్గరకువెళ్లి "మా వూరునుండి మాంచి కాఫీ పొడరు పట్టుకొచ్చేం. కాఫీ కలపడం వచ్చా?" అని ఒకరు

"సిజర్ కంటె, క్యావ్ స్టెన్ కొంటే మంచిది. లీలాక్ కంటే మగాక్ బాపుంటుంది వేసంకాలం, పాటకచేరీలో షరబత్తు ఐస్ వేసిఇస్తే చాలాగొప్ప గావుంటుంది" ఆ వరసలో ఒకళ్ళూ మొదలు పెట్టి, తాళం చెవులు, వాట్లను భద్రపరిచే అలమార్లను ఖబ్జా చేసుకున్నారు. మందేశం ఈ కలివిడికి ఆశ్చర్యపోయి, అన్నాళ్లూ కల్గిన అన్నగారి వాళ్ళమీద ఆరాధన కొంచెం గ్రహణం పట్టించుకున్నాడు.

తనవైపు, కావలసిన, అండగానుంచున్న వాళ్ల ఆత్మీయత పొందినట్లే చిన్న మాపులో పడ్డాడు. సుబ్బులక్ష్మి మాచేరా మా వాళ్ల కంజాయింపు అని పమిటి విసురుకుంది.

రేపనగా వస్తారనుకున్న అత్తవాళ్ల తరపు వారంతా వచ్చేరు. వాళ్లవిడిదిల్లోదిగి, వాళ్లూ పెళ్లివారయ్యేరు; మనుగుడుపులకువచ్చినట్లే.

ఆ పెళ్లి మూడు రోజుల్లోనూ, రెండు రకాల వైరుధ్యాలుమాత్రం బీజం, మొలక, తీగ, దొంక అవ్వడం కన్పించితే, మనస్సులో ఆరాటవ పడిపోయేడు మందేశం.

ఎప్పుడు ఏ సమయంలో చూచినా అత్తింటివైపు వాళ్ళల్లో అధికార ఫాయిదాలో చెలాయింపులూ, దానికి కావలసిన తాబేదార్లకోసం, ప్రతీ క్షణంలోనూ తన దగ్గరకువచ్చి, పితూరీలు, క్షణం తీరికలేదు, చేసేపనీలేగు అన్న దృశ్యం కన్పించింది.

రెండోవైపు వడుంలోతుకు పోతున్నా, గౌరవం, మాట, ప్రతిష్ఠ పోతుందని, కనురెప్ప మూయ్యకుండా, ఇరవైనాల్గు ఘంటలూ పనిచేసి, అందర్నీ తృప్తిపరచడంకోసం పడే ఆరాటన, పెదిమలు విప్పని, అంతర్ముఖంగా ఈ చెలాయింపుల్లో శిలుక్కి కొల్లు తోడుకున్నాం అనేవాళ్ళమీద, కోపం, ఈర్ష్య, అన్నీకూడా ములుకులే అవుతున్నా మ్రింగడం, ఒక్కపెదిమైనా కల్పకుండా మూడురోజుల్లోని ఘంటలూ తడుముకోకుండా జరగడం కన్పించింది. వాళ్లు వచ్చి తనకు చెప్పిన విషయం కన్పించలేదు.

మందేశాన్కి, ఈవర్గ విభేదాల్లోని అంతరాంతం గుర్తుకు రావటంలేదు. ఒక్కటి తన్ని బయటే వుంచి, అన్నీ వాళ్లు చేసేసేరు, వాళ్లింట్లో విషయంలా. అదే బీజాలు దదివపడంలా, అర్థం కాకుండా వుండిపోయింది. ఒక్కొక్కసారి ఈ అంతస్థుల విభేద దృశ్యంలోని వైరుధ్యం, తన్ను ఆరాట పర్చి, అశాంతి కల్గించి ఎప్పుడు అగ్నిపర్వతం పగులుతుందో అన్నభయం కల్గచేసినా, పండిన మీసాల్లోంచి కళ్ళతో నవ్వుతూ, కొలకుల్లోంచి పని చెప్పి, సవ్యంగా చేసి, చేయించే అన్నగారు మాత్రం అందరిలోనూ, అన్నిచోట్లా కన్పించేడు. ఆయనే లేకపోతే...

పెద్ద పంక్తిమీద వియ్యంకుడి దగ్గరకు మామగారు వచ్చి "మాచేరూ! ఏదో వయస్సు మళ్ళింది. ఉండలేక మంచి చేసుకున్నా..." అని నవ్వేడు.

తెలియని అగౌరవంలో ఆయన నవ్వి "దానికేంచాలామంచిపని చేసేరు"అనేసేడు.

కాని మాటల్లోని శబ్ద భేదం తన్ని ఇరుకులో పెట్టేసింది. ఆయన ఒక్కడే కాదు. వాళ్ళ కుటుంబం అంతా కూడా ఒక్కనాడైనా, తన వాళ్ళ సహ బంక్తిని కూర్చుని...

కోపం వచ్చింది. ఒళ్లు మండినట్లే అయ్యింది. కొన్న షరబత్తు సీసాలు, సిగరెట్లు, తనవాళ్లు ఒక్కటే నా...అన్న సందిగ్ధం కల్గింది.

జప ధరతుతు జ్ఞప్తికి వచ్చేరు, అంతే.

* * *

ఆరోజు.

వెళ్లే వాళ్లందరికీ యథోచితంగానే బట్టలు పెట్టేడు. అన్నగార్ని, వదినగార్ని కూర్చోబెట్టి, తాంబూలం ఇచ్చినప్పుడే, ఒక్కసారి రక్తస్పర్శలోని దగ్గరతనం, ఉబికిపోయింది. అన్నయ్య, తనూ కల్పిన రోజులన్నీ సమీక్షే అయ్యేయి అవి రాలేవు. మర్చిపోలేవు. హృదయాల్ని విడతియ్యలేవు. సామీప్యం...

మెళ్లో జరీచాపు వేసి, పాదాభివందనం చేసేడు మందేశం. కళ్ళమ్మటనీళ్లు ఊటలే అయి, కాళ్ల మీద పడ్డాయి...

హృదయం ఉబికింది. అంతమందీ ఉన్నారన్న జిజ్ఞాసేపోయింది. "అన్నయ్యా! క్షమించగల్గితే క్షమించు" అనేసేడు.

తెల్లబోయిన ఆయన లేచి దగ్గరగా కౌగలించుకునే మైమరపు చెందేడు వెక్కి వెక్కి ఏడ్పు నిలబెట్టుకోలేని మందేశం వీపు నిమురుతూనే, రుద్ధకంఠంతో "ఎప్పుడూ మనం అంతా ఒకటే కాదురా! అల్లా బెంబేలు పడతావేమిటి?" అని అనేటప్పటికి, మందేశం చంటిపిల్లాడే అయిపోయేడు.

ఇంకో రెండు వారాలు, మనుగుడుపులు వెళ్ళేవరకైనా ఉంచండి అని అల్లుడిలా బ్రతిమాలించుకుంటున్న మామగారు అటువైపు వచ్చి, ఈ సమిష్టి కలియికకు అదిరిపోయి, లోపలకు అడుగులు వేసేసేడు.

ఆ సాయంకాలం బండిలో తనకు ఇంక స్థలం లేదన్నట్లుగానే వెళ్లిపోయేడు.

ఈనాటికి ఆలోచిస్తూనే వుంటాడు, పుట్టింటికి అత్తింటికి మధ్యదూరం ఎంతని, మందేశం మాట్లాడలేక మాతిరుట్టుకున్న సుబ్బులక్ష్మి వైపు కళ్లతోనే ప్రశ్నించి ఆలోచిస్తూనే వున్నాడు రెంటికీ దూరం ఎంత?



# చీకట్లో పచ్చగడ్డిమోపు

కవికొండల వెంకటరావు

"స్వాతంత్ర్యము స్వాతంత్ర్యము" అని మనం అంటామే "ఇది ఎందులోవుంది? మూడురంగుల జెండా ఎత్తడంలోవుందా? ఏడుకొండలవాడి మహిమలో వుందా?" అని యీ ఎనిమిదవ వార్షికోత్సవసందర్భంలో ఆలోచిస్తూ ఆలా 15 8 1955న వీచే శుభోదయ మందమారుతానికి తలూపుతూ యావత్ భారతావని ప్రజల్ని ఒక్కసారిగా తిలకించాను!

వాళ్లందరూ ఏదో చైతన్యం, వినూతనంగా పొందుతూవున్నట్లు, ఎవళ్లకు వాళ్లే ఏదో ఉత్సాహంతో వున్నట్లు నామనోనేత్రానికి కనపడ్డారు. కాని అసలు నేత్రానికి ఎట్టయెదుట మరో దృశ్యం ప్రత్యక్షమయింది. దైనికచర్యలో దండివ్యాయామనమౌతూ, త్వరత్వరగా పచ్చగడ్డి కోస్తూవున్న ఒకానొక యువతి గోచరించింది ఆమెకేసి మరో యువకుడు ఆ పచ్చికబీడు దున్నడానికి సిద్ధంగా వున్నవాడు చూస్తూవున్నాడు. యువకుడు నాగలి పన్ని ఎడ్లకోసం వెదకుతూ "కోసికోవడం ఇంకా కాలేదా?" అన్నాడు. "ఈ చెక్కనిండా చెంగలిగడ్డి మొలవనివ్వరాదంట్రా? నన్నే లేవగొట్టాలా?" అంది కొడవలి కోత మాని నడ్డి ఎత్తి, సన్నని గొంతుకతో ఆ పడుచు.

యువకుడు పడుచుకేసి పరకాయింపుగా చూచాడు. ఇద్దరూ ఆ స్థలం దురాక్రమణ కావిస్తూవున్నట్లే కనబడ్డారు. వాని యూహ "ఎక్కడ దున్నితేం నేలకదా?" అని. దాని యూహ "ఎంత కోస్తేం గడ్డిగదా?" అని ఎకరం నేల దున్నినా దున్నడమే, పట్టెడుగడ్డికోసినా కొయ్యడమే ఎక్కడో ఓ కాడ ఆపూట!" అన్నట్లు తహతహ మన్నారు వాళ్లద్దరూ.

ఆ ఉబలాటం ఆపూట మహత్తు అని నా ఆలోచన పోసాగింది. అప్పటి కెనిమిదేళ్లే, భారతియూనియన్‌కుస్వాతంత్ర్యంవచ్చింది. మూడు రంగులజెండా మురిపెంతో, ధర్మప్రసిద్ధ ధర్మచక్రం కాపాడుతూంటే, ఇంటింటా, వాడవాడా, ఎగురుతూవుంది. పైనుంచి పూలవర్షం కురుస్తూవుంది నాయకులమీద! ఋతువు పోకడకూడా బహురమ్యంగా వుంది.

ఆదారినే ఒక ఉద్యోగి వెడుతూవున్నాడు. యువకుడు నాగలి తనది కానట్టుగా నిలబడివున్నాడు. "లచ్చి అన్నది పచ్చగడ్డిలోమాత్రం వుండదా" అని కొడవలి పగును పడుతూవుంది ఆయువతి. ఇంత భీతితో బ్రతికే మనం ఈప్రపంచంలో వుండరాదనుకుంటాను అన్నాడు యువకుడు. యువతికూడా ఆలాంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చుతూ కొసమాట ఒకటి వొదిలింది; "ఆరికేంరా? ఆరు మహారాజులు! నెలకు వెయ్యి రూపాయలు జీతంగా పుచ్చుకుంటూ, ఈపొద్దు ఎక్కడికో జాతీయ పతాక మెత్తడానికి వెడుతూండబోలు. మనకు రెక్కాడితే గాని డొక్కాడదు! ఇలా ఒక మోపు పచ్చగడ్డి కోసుకు వెడితేగాని మాపటికి నాకు బియ్యమే వుండవు. నీ భాగ్య మెలాటిదో గాని!" అంది. ఉద్యోగి వారిని దాటాడు. యువకుడు భూమిని, మరి ఎద్దు దొరక్క, దున్నకుండానే పన్నిన నాగలిని విడదీసి మొత్తకు మొత్తా, మోకుకు మోకూ మోసికొంటూ నిష్క్రమించాడు. యువతి ఆ బీడుమీద స్వేచ్ఛగా పచ్చగడ్డిమడి అడ్డు లేకుండా, కోసికోసాగింది. ఆమె జోలీకొంటే ఎవరికీ మరి అక్కర్లేనట్లు ఆ పగలంతా గడిచిపోయింది. కారణం, ఆమె అక్కడనుంచి లేవకుండా ఆనాడు తదేక దీక్షతో ఆ పచ్చగడ్డినంతనూ కోయడమే. మర్నాడు కోస్తే ఎవ రేమందురో? ఆనాడు అంతా ఆమెకు స్వేచ్ఛే!

సాయంకాలపు సూర్యుడు ఇంకా క్రిందకు పడమటకు దిగిపోతూ ఆమె ముఖము మీదకో వెలుగు బఱపెంది. ఆమె ఒక చిరునవ్వు లోలోన నవ్వుకొంది. మోపెత్తుకుంది. పట్నం వెంపుకు నడచివెళ్ళసాగింది.

పట్నంలో ఏ యింటిమీద చూచినా, ఏ రచ్చమీద చూచినా, 'జాతీయ పతకాలు ఎగురుతూ వున్నాయి జండాలు బలేగా ఎగురుతూ వున్నాయి. ప్రతిచోటా పట్నంలో బలేగా ఎగురుతూవున్నాయి. పల్లెటిపట్టుల్ని ఆమె గూడెంకాడ కూడా ఎగురుతూందేమో ఆమె కానలేదు. చీకటి పడ్డాక, బాగా చీకటిపడ్డాక ఆమె తిరుగా యిల్లు చేరుకోవడం. పొద్దున్నే చద్దివణ్ణము మూటకట్టుకుని తెచ్చుకుని ఏ ఏటిపంచనో తిని, ఎక్కడెక్కడి పచ్చగడ్డి కోసుకు, మోపుకట్టుకు, పగలల్లా పాటుపడి, పట్నంలో అంగడిలోఅమ్ముకుని, ఆ డబ్బులు పెట్టి కొన్ని బియ్యం, ఉప్పు, మిర్చి వగైరాలు కొనుక్కొని ఆ సరుకుతో తన పల్లెను చేరుకోవడమే ఆ ఆడమనిషియొక్క దైనందిన కృత్యము.

ఏనాడూ రాత్రి బాగా చీకటి పడితేనే గాని ఆ పడుచుకు పచ్చగడ్డిమోపమ్ముడు కాదు అసలు ఏ పడుచులకైనా చీకటి పడ్డాకే పచ్చగడ్డి మోపు లమ్ముడుకావడం. అందులోనూ ఆ పడుచుకు మరీ చీకటి పడాలి!

ఆనాడు మరి మరీ చీకటిపడినా ఇంకా అమ్ముడుకాలేదు ఆ పడుచుయొక్క పచ్చగడ్డిమోపు. ఇక అమ్ముడు కాదేమో ఆనాడు తాను పస్తు పడుకోవలసి వస్తుందేమోనని అనుకొంది ఆమె అది స్వాతంత్ర్యదినం అనుకొంది. అనుకుంటూనే ఎదరింటిమీద దిగిరే జాతీయ పతాకంకేసి చూచింది. అది టపటపా కొట్టుకొంటూవుంది. ఆ పడుచు తన గుండెలమీద చేయివేసుకుంది. అవన్నీ లబ్ లబ్ కొట్టుకొంటూ వున్నాయి ఫరవాలేదనుకుంది. మోపువంక చూచింది. మోపు ఆర్ద్రంగా, హాసితంగా కానవచ్చింది. ఎవరో వచ్చేజాడయింది. ఎదురు చూచింది

ఆమె అనుకోలేదు ఒక తెల్లని ఆంబోతు మెళ్లో ఎఱ్ఱటి మెట్టతామర పూలదండతో వచ్చి వచ్చి, ఆ ఆకుపచ్చని గడ్డిమోపును ఊడలాక్కొన్ని, రోడ్డంట చిందర వందరగా తింటూపోసాగింది. పడుచుపిల్ల పరుగు పరుగున వెంటాడిస్తూ దాన్ని ఒక్క జబురు జబిరింది తన అరచేత్తో! "అలాంటివే ధర్మచక్ర ప్రయోగాలు" అని అన్నాడు. ఎక్కడున్నాడో ఆ చీకట్లో ఆ మహానుభావుడు?

పడుచుపిల్ల పకాల్న నవ్వుతూ "మువ్విక్కడే యున్నావా? నీకేనా ఆ ఆంబోతు" అంది ఉదయాన్నే తాను చూచిన యువకుని గంటూ. "ఊరికె కోసుకొచ్చిన గడ్డి నూరికే తింది ఊరాంబోతు! నాదైతే పొద్దున్న నాగలి కట్టెయ్యకపోయావాణ్ణా?" అన్నాడు యువకుడు. పిల్ల "నీ నాగలి కట్టినా అంతే గుక్క!— నేనంటే ఊరికే తిననిచ్చాను గాని రేపు తిననిస్తానురా!" అంది. ఆంబోతు మాట్లాడకుండా ఆకుపచ్చని గరికను నోట్లో నెమరువేస్తూ రాలుస్తూ ఆలా నిలబడిపోయింది పూర్తి అయిన జాతీయ పతాకంలాగ! ★

# ముక్కు

"చదలవాడ

బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు" అన్నాడొకకవి. "బ్రతికివుంటే బలుసాకైనా తినవచ్చును" అన్నాడింకొక ఆహారనిపుణుడు. (*Food Expert*) ఇంచుమించుగా అదేఅభిప్రాయాన్నే "ఊపిరివుంటే ఉప్పు అమ్మికూడా బ్రతకవచ్చు" అన్నాడొక వ్యాపారదృక్పథంగల పెద్దమనిషి. ఆకవి, కక్కుర్తిమనిషి, వణిగ్వరుడు - ముగ్గురూ మూడువిధాలుగా అన్నారేగాని ఊపిరివుండడానికి కారణభూతమై మానవశరీరంలోని ముఖ్యావయవాల్లో ఒకటై పంచేంద్రియాలలో ప్రముఖస్థానంవహించిన ముక్కునుగురించి ఒక్కముక్కకూడా చెప్పకుండా మౌనంగా వదిలేశారు. కాని, తిన్నగా ముచ్చటించేకొద్దీ ముక్కుయొక్క ప్రాముఖ్యం మనలను ముగ్ధులనుచేసి తీరుతుంది.

తరులతాదులు, పశుపక్ష్యాదులు మనలాగే ప్రాణవాయువును పరిగ్రహించుచున్నవిగాని వృక్షజాతికి ముక్కు అసలేలేదు. పక్షులకు ముక్కు, నోరు కలిసినట్లుగానే కనిపిస్తుంది. మృగజాతికి ముక్కంటూ ఒకటి వుండినా అది ఊపిరిపీల్చుకోవడానికి పనిపట్టడానికితప్ప మరెందుకూ పనికిరాదు. ఆరీతిగాకాకుండా మనముక్కు చాలా విషయాల్లో ముఖ్యపాత్ర వహిస్తుంది. ఒకవంక ఊపిరిపీల్చుకుంటూ బ్రతికి "బలుసాకు తిని" - ప్రాపంచిక "సుఖములు బడయడం" కాకుండా ప్రాణాయామంచేస్తూ పరమేశ్వరధ్యానంలో మనసు మగ్నంకావించి శక్తి పొందడానికిన్నీ ముక్కు మూలాధారమైనది. యోగాభ్యాసంచేత,

"పవనునిబంధించి పశ్చిమవీథి -
జొనిపి కోణత్రయ శుద్ధిగావించి -
మనసుతోడనెగూడ మలుపించి తెచ్చి -
కుండలి నిజశక్తిగూర్చి సంప్రీతి -
కొండొండ కమలంబు లొగినాలుగడచి-
అట చంద్రమండలం బల్లనజేర్చి"

అనేస్థితినిపొంది యోగేశ్వరుడైన పరమేశ్వరుని ప్రసన్నంచేసుకొని "యోగేనాంతే తనుత్యజ" అన్న సూక్తిప్రకారం తనువును వీడి జన్మ తరింపజేసుకోవడం ముక్కులేకుంటే మున్మాటికీ సాధ్యం కాదు. ఇంత సూక్ష్మమైన అవయవం మోక్షసాధనకు ముదటి మెట్టుగా వుండడంచూస్తే "సూక్ష్మంలో వుంది మోక్షం" అన్నమాటకు అర్థం తెలుస్తుంది.

ఆధ్యాత్మికంగా అంతటి ప్రయోజనం కలిగివుండడంకాక, ముఖానికి అందం చేకూర్చడంలోనూ ముక్కుకు సాటిలేదు అందుకనే మనము "కన్ను, ముక్కు తీరు" చూడనిదే కన్యలను వరించము. ఆ ముక్కు తీర్చిదిద్దినట్లు ముచ్చటగావుంటేనే ముక్కుపుడక, ముక్కెర, బులాకీ, నత్తు మొదలైన నగలు ధరించి ముద్దు మురిపెం తీర్చుకోవడానికి వీలు కలుగుతుంది. "ముక్కులేనివాడు ముక్కిడి" అని ఒకటోతరగతి వాచకంలో ఒకానొక పాఠంలో చెప్పి వుంది. అటువంటిముక్కిడికి ముక్కుపుడక ధరించే భాగ్యం వుండదు. "నాసాగ్రేనవమౌక్తికం" అని శ్రీకృష్ణుని తన మనఃఫలకంలో చిత్రించుకొని ఒకకవి మననంచేసుకొన్నాడు. శూర్పణఖ మొదట శ్రీరామచంద్రమూర్తిని మింగేద్దామనే తలంపుతో, "ఉత్తుంగనాసియు, సుగ్రభావంబు"తో వచ్చింది. కాని తీరా ఆ నల్లవాణ్ణిచూచి వల్లమాలిన మోహంతో పతివిక్రమ్మని మతిచెడి పైకొచ్చింది.. అంతటి రక్కసి సరసం ముక్కు, చెవులు కోయడంతో ముగిసింది. "చేయొడ్డి వలచివచ్చిన చెవులుముక్కు, పోయే" అనే సామెతకూడా ఆ సందర్భంలోనే అవతరించింది. ముక్కు పోగొట్టుకొన్న శూర్పణఖ ముఖంచెల్లక రావణుని దర్బారుకోకివెళ్లి "ఇదె నాదు ముఖభంగ మీక్షింపునాదు - కొదవనీ కొదవగా కోర్కి భావింపు" అని మొరపెట్టుకొనింది. అంతటితో ఆగక తన ముక్కుపోయినా సీతమ్మవారి ముక్కును" ఆ చెక్కులా ముక్కు, ఆసోయగంబు నేమందునే గాన నే యింతులందు"అని వర్ణించింది.

కవులు మామూలుగా స్త్రీలముక్కులను మరుని తిలపుష్పబాణ మీ మగువముక్కు" అని నువ్వుపువ్వుతో పోలుస్తారు. కాని చాలా మంది ప్రబంధకవులు తమ నాయికల కచకుచాది వర్ణనల హడావిడిలో పడిమరిచిపోయి కాబోలు, అక్కడక్కడ గాలివాటుగా ఒక పద్యపాదం ముక్కుకు వినియోగించినట్లు తోస్తుంది. ఆ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకొని నంది తిమ్మన,

"నానా సూన వితానవాసనల
నానందించు సారంగమే
లా నన్నొల్ల దటంచు గంధఫలి
బల్కాకన్ దపంబంది, యో
షా నాసాకృతి బూని సర్వసుమ
సౌరభ్య సంవాసియై
పూనెం ప్రేక్షణ మాలికా మధుకరీ
పుంజంబు లిర్వంకలన్"

అనే పసందైన పద్యం ముక్కును గురించి చెప్పి "ముక్కుతిమ్మన" అనిపించుకొన్నాడు. నందితిమ్మనగా వుండేటప్పుడు కనిపెట్టలేని నాణ్యం ఆయన కవిత్వంలో ఆ

(48-వ పేజీ చూడండి)

# దుర్గామందిరం

మూలం: ప్రేమ్‌చంద్  అనువాదం: "ద్వారకా"

## 1

బాబూ వ్రజనాథ్ 'లా' పుస్తకాలు చదవటంలో నిమగ్నుడైవుంటే ఆయన కుమారు లిద్దరూ అల్లరిలో నిమగ్నులై వున్నారు. 'మున్నా నా బొమ్మను తీసుకొని యివ్వటంలేద'ని శ్యామ అరుస్తుంటే, "శ్యామ నా మిఠాయి తినేసింద"ని మున్నా ఏడుస్తున్నాడు.

వ్రజనాథ్ కోపంతో భామను పిలిచి "యీ దుర్మార్గులను యిక్కడినుండి తీసుకపోకూడదూ? లేకపోతే నేను ఒక్కొక్కరి సంగతి కనుక్కుంటాను." అన్నాడు.

భామ ఫాయ్యి రాజేస్తూ వున్నది. "అయితే సాయం సమయంలో కూడా చదువుతూనే వుంటారా? కొంచెం పూపిరయినా పీల్చుకోండి." అన్నది.

వ్రజనాథ్:- లేచేపని లేదా. అక్కడ కూర్చునే న్యాయశాస్త్రమంతా ఒప్పజెప్పేస్తున్నావే! ఒకటి రెండు బాగా అంటిస్తే అయ్యయ్యో! పిల్లల్ని చంపేశాడని అరుస్తూ వస్తావు.

భామ:- అయితే నేను వూరికే కూర్చొని నిద్రపోతున్నా ననుకున్నారా? ఒక గడియసేపు మీరే పిల్లల్ని సముదాయిస్తే అరిగిపోతారు కాబోలు నేనొక్కదాన్నే వాళ్ల పన్లు చేయాలని ఎక్కడయినా వ్రాసి పెట్టి వున్నదా?

బాబూ వ్రజనాద్ ఏ విధమయిన సమాధానము యివ్వలేకపోయాడు. కోపము నీటి వలెనే దారిచేసుకోలేనప్పుడు ఉధృతంగా పొంగిపోతుంది. వ్రజనాథ్‌కు నైతిక సిద్ధాంతాలతో బాగా పరిచయమున్నది గాని వాటిని యీ సమయంలో ఆచరణలో పెట్టటానికి కావలసిన తెలివితేటలు అతడిలో లేకపోయినయ్. వాది ప్రతివాదు లిద్దరికీ, ఒకే కర్రతో శిక్ష విధించి, వాళ్లు పెద్దగా ఏడుస్తూవుండగా 'లా' పుస్తకాన్ని చంకలో పెట్టుకొని 'కాలేజీ పార్కు' వంకకు పోయాడు.

## 2

శ్రావణమాసం. ఎన్నో రోజులతరువాత యీనాడు మేఘాలు తెరవిడిచినాయ్. నిండురంగుతో కళకళలాడే చెట్లు సువర్ణకిరణాలను కప్పుకొన్నయ్. మృదుమందసమీరం శ్రావణరాగాన్ని ఆలాపిస్తున్నది. పక్షులు కొమ్మలమీద కూర్చొని తన్మయత్వంలో వూగుతున్నయ్. వ్రజనాథ్ ఒక సిమెంటు బెంచీమీద కూర్చొని పుస్తకం తెరిచాడు. కాని, యీ గ్రంథంలోని పుటలకన్నా ప్రకృతి పుస్తకంలోని పుటలు ఎక్కువగా అతడిమనస్సును ఆకర్షించినయ్. కొంచెంసేపు ఆకాశాన్ని చూచాడు. కొంతసేపు ఆకులను, కొంతసేపు నీళ్లలు జల్లుతున్న వృక్షాలను, ఇంకా అప్పుడప్పుడు ముందు మైదానంలో ఆడుకొంటున్న బాలురను చూస్తున్నాడు.

అనుకోకుండా అతడిదృష్టి ముందు గడ్డిమీద పడివున్న కాగితపు పొట్లాంమీదకు ప్రసరించింది. మమత ఆలోచనా పూర్వకంగా ఇందులో యేమున్నదో చూద్దామన్నది

బుద్ధి అందులో యేముంటే మనకేం? అన్నది.

ఆలోచనాపూర్వకమయిన మమతకే విజయం లభించింది. వ్రజనాథుడు లేచి పొట్లం తీసుకున్నాడు. బహుశా కాగితంలో చుట్టబడిన డబ్బులు ఎవరివయినా అక్కడ పడివుంటయ్. విప్పిచూచాడు. అవి నవరసులు! లెక్క పెట్టిచూస్తే ఎనిమిది వున్నయ్. కోరికకు హద్దులేక పోయింది.

వ్రజనాథుడికుండె కొట్టుకోటం ఆరంభించింది. ఎనిమిది నవరసులను చేతిలోకి తీసుకొని ఆలోచించసాగాడు. వీటి నేం చేసేది? ఒకవేళ యిక్కడే వుంచేస్తే? ఎవరి దృష్టిలో పడుతుందో? ఎవరు తీసుకపోతారో? కాదు. ఇక్కడ వుంచటం మంచిది గాదు.

—పోలీసు స్టేషనుకు తీసుకపోయి యీ నవరసులు వారి కప్పగిస్తాను ఎవరివయితే వారు తీసుకపోతారు. వారు తీసుకొని పోకపోయినా యేదోషమూ నామీదకు రాదు. నేను పరలోకంలో అనుభవించాల్సిన శిక్షనుండి విముక్తి పొందుతాను! అని ఆలోచించసాగాడు.

మమత తన మంత్రాన్ని చాటునుండి ప్రయోగించటం ప్రారంభించింది. ఆయన పోలీసు స్టేషనుకు పోలేదు. భామ దగ్గర ఒక తమాషా చేద్దామనుకున్నాడు. భోజనం తయారయివుంటుంది. నెమ్మదిగా స్టేషనుకు పోవచ్చు!

భామ నవరసులను చూచి, అపరిమితానందం పొందింది.

"ఎవరివి?" అనడిగింది

"నావే!"

"పోదురూ! ఎక్కడివో చెప్పండి."

"దొరికినయ్."

"అబద్ధం! పోనీ అట్లాగే అంత అదృష్టం మన చుట్టూ తిరుగుతుంటే ఎక్కడ దొరికినయ్యో చెప్పండి? ఎవరివి?"

"నిజం చెబుతున్నాను దొరికినయ్."

"నామీద ఒట్టు?"

"నీమీద ఒట్టు."

భామ నవరసుల్ని భర్తచేతుల్లోనుండి లాక్కోటానికి ప్రయత్నించింది.

వ్రజనాథ్: "లాగుతా వెందుకూ?" అన్నాడు.

భామ:- ఇటివ్వండి. దగ్గర వుంచుకుంటాను.

వ్రజ:- వుండనివ్వు. నేను వీటినిగూర్చి ఫిర్యాదు చేయటానికి పోలీసుస్టేషనుకు పోతున్నాను.

భామముఖం నల్లబడిపోయింది. "దొరికిన సొమ్ముకు ఫిర్యాదేమిటి?" అన్నది.

వ్రజనాథ్:—కాక మరేమనుకున్నావు? ఈ ఎనిమిది నవరసులకోసం పరువు పోగొట్టుకోమంటావా?

భామ: అయితేసరే! ఉదయమే తీసుకపోండి ఇక ఇప్పుడుపోతే తిరిగి వచ్చేసరికి ఆలస్యమవుతుంది.

వ్రజనాథ్‌కుకూడా ఇదే మంచిదని[illegible]ంచింది. పోలీసువాళ్లు రాత్రిళ్లు యేపనీ చెయ్యరు. వాదూ ఫిర్యాదూ లేకుండ అక్కడ పడివుండటమెందుకు. స్టేషన్లో ప[illegible] వుండేబదులు నాయింట్లోనే వుంటయ్.

నవర[illegible] పెట్టెలో పెట్టేశాడు. అన్నపానా[illegible] తపడుకున్నాడు భామ ప్రక్కన కూర్చొని లాలిస్తూ "కావలని వచ్చినసొమ్మును కాదనటమెం[illegible]

నా చేతికివ్వరాదూ! ఒక చంద్రహారం చేయించుకుంటాను. చంద్రహారం పెట్టుకోవాలని ఎన్నాళ్లనుంచో మనసుగా ఉన్నదండీ!" అన్నది.

వ్రజనాథ్ అనంగీకారాన్ని సూచిస్తూ "చంద్రహారంమీద మోజుతో నా మెడకు వురిబిగిస్తావా!" అన్నాడు.

## 3

ఉదయమే వ్రజనాథుడు స్టేషనుకు పోవటానికి తయారవుతున్నాడు. "ఆ" మీద ఉపన్యాసం ఒకటి పోగొట్టుకోవాల్సొస్తుంది అయినా ఫరవాలేదు

వ్రజనాథుడు అలహాబాదు హైకోర్టులో అనువాదకుడుగా వుంటున్నాడు. ఉద్యోగంలో పైకిపోయే సూచనలు యేవీ కనిపించటంలేదు. అందువలన ఒక సంవత్సరంనుండి ప్లీడరు పరీక్షకు చదువుతున్నాడు.

అప్పుడే బట్టలు కట్టుకుంటున్నాడు తన స్నేహితుడొకడు - మున్షీ గోకులలాల్ అనే ఆయన వచ్చి కూర్చొని తన కుటుంబం అనుభవిస్తున్న కష్టాల రామాయణాన్ని సవిస్తరంగా చెప్పేసి, అతి వినయంగా "అన్నగారూ! కష్టాలు నా చుట్టూ దట్టంగా అల్లుకుపోయినయ్. వీటివల్ల మనసు పాడయిపోయింది. నీవు గొప్పవాడివి. ఈ సమయంలో కొంచెం సహాయం చెయ్యి - ఎక్కువకాదు ఒక మూడయి రూపాయిలివ్వు యేదో విధంగా పని గడుపుకుంటాను "ఈరోజు మూడవ తేదీ రేపు సాయంత్రానికి నీ డబ్బు నీకు ముట్టజెపుతాను" అన్నాడు.

వ్రజనాథ్ గొప్పవాడు గాదు. కాని గొప్పతనమనే గాలిని మూటగట్టుకొని కూర్చున్నాడు లేనిపోని గొప్పదనాన్ని నటించటం అతని స్వభావంలోని దౌర్బల్యమే. కేవలం తను గొప్పవాడిననే విషయాన్ని అందరికీ తెలియజెయ్యటానికే మిత్రుల స్వల్ప అవసరాలను తీర్చటంకోసం తన నిజమయిన అవసరాలను బలిచేస్తుంటాడు. భామకు భర్తయొక్క యీ ప్రవర్తన సరిపడదు. ఋణంకోసం త్యాగం చేయటం వృధా అని ఆమె అభిప్రాయం అందువల్లనే వ్రజనాథ్ ఇటువంటి కష్టంలో ఇరుక్కుపోయినప్పుడెల్లా కుటుంబంలో శాంతికి భంగము కలుగుతుంటుంది. ఆయనలో లేదని చెప్పటానికిగాని, యేదో సాకు చెప్పి తప్పించుకోటానికి శక్తిలేదు.

సంకోచిస్తూ భామదగ్గరకుపోయి "నీదగ్గర మూడయి రూపాయలు లేవా? మున్షీ గోకులలాల్ అడుగుతున్నాడు" అన్నాడు.

భామ కోపంతో "నాదగ్గర లేవ"న్నది.

వ్రజనాథ్: తప్పకుండా వుంటయ్. నిజం చెప్పటంలేదు.

భామ: సరే! అబద్ధమే ననుకోండి.

వ్రజ: అయితే నేనాయనతో యేమని చెప్పేది?

భామ: ఇంట్లో లేదని చెప్పండి. మీకు చెప్పటం చేతగాకపోతే నేనే పరదాచాటునుండి చెప్పేస్తాను.

వ్రజ: చెప్పటానికి నేనూ చెప్పతాను. కాని ఆయన నమ్మకంచాలక అబద్ధం చెబుతున్నామనుకుంటాడు.

భామ: అనుకుంటే అనుకోనివ్వండి!

వ్రజ: అంత నిర్మొగమాటంగా చెప్పటం నా చేత గాదు. పగలుగూడా రాత్రితో సమానమయిపోతుంది. ఎట్లా లేదని చెప్పేది?

భామ: సరే అయితే! మీ కేమి చెయ్యాలనుకుంటే అదే చెయ్యండి. నేను నాదగ్గర డబ్బు లేదని ఒకసారే చెప్పేశాను.

వ్రజనాథ్ మనసులో చాలా బాధపడ్డాడు భామ తనదగ్గర డబ్బువుంచుకొనిగూడా తనను అవమానపరచటానికే లేదని చెప్పుతున్నదనుకున్నాడు. ఆమెమీద వచ్చినకోపం అతడి సంకల్పాన్ని దృఢతరం చేసింది పెట్టెలోనుండి రెండు సవరసులు తీసి గోకులలాల్ చేతులో పెడుతూ "అన్నా! రేపుసాయంత్రం ఆఫీసునుండి తిరిగివచ్చేప్పుడే డబ్బు తిరిగి యివ్వాలి. ఇది ఒకరు వుంచమంటే వుంచిన సొమ్ము. నేను యిప్పుడే వారికి యివ్వబోతున్నాను. రేపు యివ్వకపోతే అప్రతిష్ఠపాలయిపోతాను ఎక్కడా తలెత్తుకొని తిరిగే యోగ్యత గూడా లేకుండా పోతుంది.

గోకులలాల్ తన మనస్సులో యీ డబ్బు అతడిభార్యదిగాక యింకెవరిదీ అయి వుండదని, అనుకున్నాడు. సవరసులను జేబులో పెట్టుకొని ఇంటిమార్గం పట్టాడు.

## 4

మొదటి తేదీ సాయంత్రం. వ్రజనాథుడు వాకిలిదగ్గర కూర్చొని గోకులలాల్ రాకకు ఎదురుజూస్తున్నాడు.

ఐదుగంటలయింది. గోకులలాల్ ఇంతవరకూ రాలేదు. వ్రజనాథ్ కళ్లు మార్గాన్ని వెదుకుతున్నయ్. చేతిలో వార్తాపత్రిక వున్నది. చదవటానికి మనసురావటంలేదు. ప్రతి మూడో నిముషం దారివంక చూస్తాడు. ఈరోజు జీతాలిచ్చే రోజు. అందువల్లనే రావటం ఆలస్యమయివుంటుంది. వస్తానే వుండవచ్చు ఆరుగంటలైంది. గోకులలాల్ జాడలు కనిపించలేదు. ఆఫీసు గుమాస్తాలందరూ ఒకరొకరే వెళ్ళిపోతున్నారు వ్రజనాథ్ ఎన్నోసార్లు మోసపోయాడు. ఆయన వస్తున్నాడు; తప్పకుండా ఆయనే; అదే చొక్కా; అదే టోపీ; నడకకూడా అట్లాగే వున్నది; ఈ వైపుకే వస్తున్నాడు: హృదయంమీద ఏదో బరువు దిగిపోయినట్లయింది దగ్గరకొచ్చేసరికి ఆయ నెవరో అయిపోయేవాడు. ఆశతో కలిపించుకున్న మనిషి నిరాశలో లీనమయిపోయేవాడు. వ్రజనాథ్ మనస్సు

ముఖంలో నిండిపోయింది. ఒక్కసారి కుర్చీలోనుండి లేచాడు. ఇంటిముందుకు పోయి మార్గాన్ని రెండువైపులా పరిశీలించాడు. ఎక్కడా కనిపించలేదు.

రెండుమూడుసార్లు ఎక్కా బండ్ల వర్తకుడిని గోకేలాల్ వస్తున్నాడని భ్రమ పడ్డాడు, కోరిక గొప్పదనం!

ఏడుగంట లయింది. దీపాలు వెలిగించారు. రోడ్డులో చీకటి వ్యాపిస్తున్నది. రోడ్డుమీద వ్రజనాథ్ పిచ్చివాడిలాగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. గోకేలాల్ ఇంటికి పోదామా! అటువైపు ఒక అడుగు ముందుకు వేశాడు. కాని మార్గంలోనే గోకేలాల్ కనిపించి, యీ కొద్ది మొత్తానికే ఇంతగా భయపడుతున్నావా? అని అంటే యేమోనని హృదయం కంపించిపోయింది. కొంచెం దూరం పోయేసరికి ఎవరో వస్తున్నట్లనిపించింది. గోకేలాల్ అని భ్రమపడ్డాడు. వెనక్కి తిరిగి వరండాలోకి వచ్చి వూపిరి తీసుకున్నాడు. తిరిగి అదే మోసం! మరల అదే భ్రాంతి! అప్పుడు ఇంత ఆలస్యమెందుకవుతుంది? ఆలోచించాడు. ఆయన ఇంతవరకు ఆఫీసునుండి వచ్చివుండడా? బహుశా అట్లా జరిగివుండదు. ఆఫీసులోని వాళ్లంతా జీతంతీసుకొని వెళ్లిపోయారు. అంటే రెండువిషయాలు జరిగివుండవచ్చు. రేపువచ్చి యిద్దామనయినా అనుకొని వుండవచ్చు. లేదా అసలు యివ్వకుండా వుండటానికే నిర్ణయించుకొని వుండవచ్చు. అప్పుడతడి అవసరం. ఇప్పుడు నా అవసరం. నేనే ఎవరినయినా ఎందుకు పంపకూడదూ? మున్నా పోగలుగుతాడు. రోడ్డు మీద ఇల్లేగా. ఇట్లా ఆలోచించి ఇంట్లోకి పోయాడు. దీపం వెలిగించి అడ్రసు వ్రాయటానికి కూర్చున్నాడు. కళ్లుమాత్రం వాకిలి వైపే చూస్తున్నయ్. అకస్మాత్తుగా కాళ్ల చప్పుడు వినిపించింది. వెంటనే కాగితాన్ని ఒకపుస్తకంక్రింద అణచిపెట్టి వరండాలోకి వచ్చాడు. చూస్తే వచ్చినవాడు ప్రక్కఇంటి వ్యాపారస్తుడు. యేదో టెలిగ్రాం చదివించుకోటానికి వచ్చాడు. అతడితో "ఇప్పుడు తీరికలేదండీ! కొంచెం ఆగిరండి" అని చెప్పాడు.

అతడు "బాబూ! ఇంట్లో వాళ్ళంతా భయపడి పోతున్నారు. ఒక్కసారి దయచేసి చూడండి" అని బతిమాలాడు.

వ్రజనాథ్ కొంచెం శాంతపడి అతడి చేతిలో టెలిగ్రాం తీసుకొని వేగంగా చూచాడు. "కలకత్తానుండి వచ్చింది. సరుకులు చేరలేదట" అన్నాడు.

వ్యాపారస్థుడు "అయ్యా! ఇంకొంచెం దయవుంచి అది ఎవరిచ్చారో కూడా కొంచెం చూడండి" అన్నాడు. వ్రజనాథ్ చేతిలోని కాగితాన్ని విసిరిపారేసి "నాకు తీరికలేదు." అన్నాడు.

ఎనిమిదిగంటలయింది. వ్రజనాథుణ్ణి నిరాశ ఆవరించింది. ఇంత రాత్రయిన తరువాత మున్నా పోలేడు. చివరకు తనే పోవటానికి నిశ్చయించుకొన్నాడు. అతడేమయినా చెడుగా అనుకుంటే? దీన్ని గురించి ఎంతవరకు ఆలోచించేది? స్పష్టంగా నా డబ్బివ్వమని అడిగేస్తాను. మంచి వాళ్ళతో మంచిగా వ్యవహరించాలిగాని ఇట్లాంటి ధూర్తులతో మంచిగా వ్యవహరించటం తెలివితక్కువ. చొక్కా తొడుక్కున్నాడు. ఇంట్లోకిపోయి, కొంచెం పనిమీద బయటికిపోతున్నానని భామకు చెప్పాడు. తలుపు వేసుకోమన్నాడు.

బయలుదేరటానికయితే బయలుదేరాడు గాని అడుగడుక్కూ ఆగుతున్నాడు. గోకేలాల్ ఇల్లు దూరంలో కనిపించింది. దీపం వెలుగుతున్నది. సంశయంలోపడి ఆగిపోయాడు. అక్కడికిపోయి యేమని అడిగేది? పోతూవుండగానే డబ్బిచ్చేసి ఆలస్యమయినందుకు క్షమించమంటే చాలా చిన్నతనంగా వుంటుంది. ఆయన నన్ను నీచుడిగా, ధనికిరానివాడిగా, పిరికివాడిగా చూస్తాడు. పోయి, ఇంట్లోవాళ్ళకు చాలా సేపటినుండి కడుపులో నొప్పిగా వున్నది, యేదయినా మందు వున్నదా? అనడుగుతాను. అహఁ! యీ సాకు అంత మంచిదిగా కనిపించటంలేదు. అసలు సంగతి తెలిసిపోతుంది. ఊఁ! అసలు ఈ జంజాటాలన్నీ ఎందుకు? ఆయన నన్ను చూచి తనకు తానే తెలుసుకుంటాడు. ఈ విషయాన్ని గురించి సంభాషణ జరగటానికి అవకాశమే వుండదు. ఈవిధమయిన ఆలోచనలతో వ్రజనాథ్ ముందుకు పోతున్నాడు, అలలు యేప్రక్కకు పోతున్నా ప్రవాహం తన దిశను మార్చనట్లు.

గోకేలాల్ ఇల్లొచ్చింది. తలుపు మూసివున్నది. వ్రజనాథ్‌కు అతడిని పిలిచేటంతటి ధైర్యం లేకపోయింది. భోజనం చేస్తూ వుండొచ్చు ననుకున్నాడు. తలుపు ముందునుండి బయలుదేరి నెమ్మదిగా ఒక మైలు దూరం వచ్చాడు. ఎక్కడో తొమ్మిది గంటలు కొట్టిన చప్పుడు చెవుల్లో పడ్డది. గోకేలాల్ భోజనం పూర్తిచేసి వుంటాడు. వెనక్కు తిరిగాడు. గోకేలాల్ ఇంటి తలుపుదగ్గరకు వచ్చి చూచాడు. చీకటిగా వున్నది. ఆకాదీపం ఆరిపోయింది. ఒక నిముషం అటూ ఇటూ తోచక వుండిపోయాడు. యేమని పిలిచేది? ఆఁ! ఇంకా చాలా సమయమున్నది. ఇంకా నిద్రపోయి వుండరు. చప్పుడు చేయకుండా నెమ్మదిగా మెట్లెక్కాడు. తలుపు దగ్గర చెవిపెట్టి విన్నాడు. ఎవరయినా చూస్తారేమోనని భయంతో నాలుగు దిక్కులా కలయజూచాడు. యేదో సంభాషణ వినబడ్డది. జాగ్రత్తగా విన్నాడు. "రూపాయలన్నీ ఖర్చయిపోయినయ్. వ్రజనాథ్ కేమిస్తావు?" అన్నది స్త్రీ కంఠం.

"అంత ముంచుకుపోయే దేమున్నది. మళ్ళీ ఇద్దాము." అన్నాడు గోకేలాల్. "ఈరోజు శలవు మంజూరయింది. మూడు నెల్ల తరువాత, తిరిగివస్తే, విషయం చూచుకొందాము."

ముఖంమీద ఎవరో ఛెళ్ళున కొట్టినట్టయింది వ్రజనాథ్‌కు. కోపంతో, నిరాశతో, మెట్లుదిగి వచ్చాడు. ఇంటికి పోతుంటే, రోజంతా శ్రమించినా ఫలితం పొందని నిర్భాగ్యుడిలాగా కాళ్లు ముందుకు పోవటంలేదు.

## 5

వ్రజనాథ్ రాత్రంతా ప్రక్కలు మారుస్తూనే వున్నాడు. అప్పుడప్పుడు గోకేలాల్ దుర్మార్గంమీద కోపంవచ్చేది. పాపం! యే బీదవాడిడబ్బో! వాడి కేమపకారం జరి

గిందో! ఇప్పుడు క్రోధంవల్ల దుఃఖంవల్ల లాభమేమున్నది? ఆలోచించసాగాడు. డబ్బెక్కడనుండి వస్తుంది? భామ మొదటనే కాదని చెప్పింది. వచ్చే ఆదాయం అంతంతమాత్రంగానే వున్నది. పదీ ఐదు అయితే ఏదోవిధంగా సరిపెట్టవచ్చు. అయితే యేంచేసేది? ఎవరిదగ్గరయినా అప్పు తీసుకోవాలి. తన కెవరిస్తారు? ఇంతవరకు ఎవరినీ డబ్బడగాల్సిన అవసరం కలగలేదు. తన కప్పివ్వగల మిత్రుడెవడూ లేడు. వున్నవారంతా తన్నే డిపించేవాళ్లే. తనకేమిస్తారు? కొద్దిరోజులు 'లా' చదవటం మానేసి అనువాదాలు చేస్తుంటే యీడబ్బు సంపాదించవచ్చు. కనీసం ఒకనెల కష్టపడి పనిచేయాలి. చాలక అనువాదకుల రాకతో కష్టంగూడా గిట్టకుండా పోతున్నది. ఓ విధియుడా! నీవు చాలా మోసం చేశావు. యేజన్మలో చేసిన పాపాన్ననుభవిస్తున్నానో! ఎందకూ కాకుండా పోయాను.

రెండురోజులనుండీ వ్రజనాథ్ డబ్బు సంపాదనలో మునిగిపోయాడు. ఉదయం 'లా' వుపన్యాసాలకు హాజరవుతాడు. సాయంత్రానికల్లా దస్తావేజులకట్టలు చంకన పెట్టుకొని ఇల్లుచేరతాడు. అర్ధరాత్రివరకు అనువాదం చేస్తుంటాడు. తలయెత్తి చూడటానికిగూడా అవకాశం వుండేదిగాదు. అప్పుడప్పుడు ఒంటిగంట రెండుగూడా అవుతుంటుంది. మెదడు పూర్తిగా శిథిలమయిపోయిన తరువాత, శరీరాన్ని మంచంమీద వాల్చేస్తాడు.

కష్టపడే అలవాటు అంతగా లేకపోయి వంగవల్ల అప్పుడప్పుడు తలనొప్పి వచ్చేది జ్వరంగూడా రావటం మొదలుపెట్టింది. అయినా అతడు యంత్రంలాగా పనిజేస్తూనే వున్నాడు. భామ విసుగులో "ఇక పడుకోండి. చాలా ధర్మాత్ములు బయలుదేరారు. మీలాంటివారు పదిమందివుంటే ప్రపంచమే తలక్రిందయేది" అనేది. వ్రజనాథ్ బాధాకరమయిన యీ వ్యంగ్యోక్తులకు సమాధానమిచ్చేవాడుగాడు. ఉదయం కావటంతోనే అదే కార్యక్రమాన్ని ఆరంభించేవాడు.

మూడు వారాలు గడిచినయ్. ఇరవై అయిదు రూపాయలు చేతికొచ్చినయ్. వ్రజనాథ్ రెండుమూడు రోజుల్లో గమ్యస్థానం చేరవచ్చునని ఆశపడ్డాడు. ఇరవై ఒకటో రోజున తీవ్రంగా జ్వరమొచ్చిందతడికి. మూడురోజులు వదలకుండా కాసింది. పనికి సెలవుపెట్టాల్సొచ్చింది. పడక భిక్షుడయిపోయాడు. భాద్రపదమాసం. జ్వరానికి కారణం పిత్తమనుకొన్నది భామ. ఒక వారంరోజులు డాక్టరుదగ్గర మందుతిన్నా తగ్గకపోయేసరికి భామ భయపడిపోయింది. వ్రజనాథ్ జ్వరంలో పిచ్చిమాటలు మాట్లాడుతున్నాడు. భామ గదిలోనుండి పరుగెత్తి వచ్చేది. పిల్లలను ఒక గదిలో తాళంవేసేది. ఈ కష్టాలన్నీ యీ నవరసులవల్లనే కలుగుతున్నవా? అనుకొన్నది భామ. ఆ డబ్బుగల మనిషి యేమయినా చేశాడేమో? ఎవరికి తెలుసు? నిజంగా యిదే జరిగుంటుంది. లేకపోతే ఎంత మందుతిన్నా లాభ మెందుక్కనిపించదు? కష్టాలొచ్చినప్పుడు దేవుడు జ్ఞాపకానికొస్తాడు. మనప్రయత్నంతో ఆపద దూరం కానప్పుడు భగవంతుణ్ణి తలుచుకుంటాము. భామ దేవతల శరణువేడింది. ఆమె జన్మాష్టమి, శివరాత్రి, నవరాత్రిళ్ళ వ్రతాలు అన్నీ చేస్తున్నది.

ఎనిమిది రోజులు గడిచినయ్. చివరి రోజు. ప్రభాతకాలం. భామ వ్రజనాథ్ చేత మందు త్రాగించి, ఇద్దరు కుమారుల్ని వెంటదీసుకుని దుర్గాదేవి పూజకు ఆలయానికి వెళ్ళింది. దేవిపై భక్తితో ఆమె హృదయం పరిపూర్ణమయివున్నది. ఆలయ ప్రాంగణంలో నిలుచున్నది. దేవీ ఉపాసకులు ఆసనాలమీద కూర్చొని స్తోత్రం చేస్తున్నారు సాంబ్రాణి, కర్పూరం వాసనలు వ్యాపించినయ్. ఆలయంలోకి పోయింది. ముందు పెద్ద దుర్గాదేవి విగ్రహం ప్రకాశిస్తున్నది. దేవి ముఖారవిందం యేదో వెలుగును ప్రసరింపజేస్తున్నది. పవిత్రత ఆమె చుట్టూ ఆవరించి వున్నది. భామ తన నేత్రాలతో దేదీప్యమానంగా వెలుగుతున్న దేవీవిగ్రహం చూడలేకపోయింది. ఆమె హృదయంలో నిర్మలము పవిత్రము భావపూర్ణమయిన భయం బయలుదేరింది. కళ్లు రెండూ మూసుకున్నది. మోకాళ్ళబలంమీద కూర్చొని రెండు చేతులూ జోడించి దీనంగా "తల్లీ! నామీద దయవుంచు." అని ప్రార్థించింది.

ఆమెకు దేవి నవ్వినట్లుగా కనిపించింది. ఆదివ్యనేత్రాలలోనుండి ఒకజ్యోతి తనలో ప్రవేశించినట్లు తోచిందామెకు. ఆమె చెవులకు యీ మాటలు వినిపించినయ్. "పరులసొమ్ము యిచ్చివేయండి. మీకు శుభం కలుగుతుంది." భామ లేచి కూర్చున్నది. పవిత్రభక్తి ఆమెకళ్లలో తొణికిసలాడుతున్నది. ముఖంలో పవిత్రప్రేమ నిర్మలధారగా వర్షిస్తున్నది. దేవి తన ప్రకాశకిరణాలతో ఆమెను ముంచివేసింది.

ఇంతలో ఎవరో మరొకస్త్రీ వచ్చింది. ఆమె పాడువయిన జుట్టు కాంతిహీనమయిన ముఖానికి రెండువైపులా జీరాడుతున్నయ్. శరీరంమీద తెల్లటిచీర మాత్రం వున్నది. చేతులకు గాజులు తప్ప వరియే యితర అలంకారము లేదు. శోకము, నిరాశ ఆమెలో మూర్తీభవించినయ్. ఆమెగూడా దేవి ముందు మోకరించి రెండుచేతులతో చీర

# ★ దుర్గామందిరం ★

చేరుకట్టుకొని "దేవీ! నాడబ్బు ఎవరు తీసుకున్నారో వారిని నాశనం చెయ్" అన్నది.

వీణాతంత్రులు దెబ్బతినగానే కంపించినట్లు భామహృదయం రాబోయే అనిష్టాన్ని విని కంపించిపోయింది. ఈమాటలు వాడి బాణాలలాగా ఆమె హృదయంలో గ్రుచ్చుకొన్నయ్. భయపూరిత నేత్రాలతో ఆమె దేవివంక చూచింది. దేవీరూపం భయంకరంగా కనిపించింది. కళ్ళలోనుండి అగ్నిజ్వాలలు వస్తున్నట్లనిపించింది. భామహృదయంలో, పక్షాల ఆకాశంనుండి, ఆలయం ముందున్న వృక్షాలనుండి ఆలయ స్తంభాలనుండి, దేవీ సింహాసనందగ్గర వెలిగే దీపాలనుండి, దేవీ ముఖంనుండి యీ మాటలే ప్రతిధ్వనిస్తున్నయ్.

"పరులసొమ్ము యిచ్చివేయండి. మీకు శుభం కలుగుతుంది."

భామ నించున్నది. ఆ వృద్ధస్త్రీతో "యేమమ్మా! మీ డబ్బు ఎవరయినా అపహరించారా?" అన్నది

మునిగేవాడు గడ్డిపరక దొరికినప్పుడు చూపించే ఆత్రుతను చూపిస్తూ ఆమె భామవంక చూచింది.

"అవునమ్మా."

"ఎన్నిరోజులయింది?"

"ఒకటిన్నర నెలయివుంటుంది."

"ఎన్ని రూపాయిలు?"

"సరిగ్గా నూటఇరవై."

"ఎట్లా పోయినయ్?"



"ఏం తెలుసు. ఎట్లాగో పడిపోయినయ్. నాభర్త మిలిటరీ వుద్యోగం చేసేవాడు. ఆయన పరలోకంచేరి చాలా సంవత్సరాలయిపోయింది. ఇప్పుడు ప్రభుత్వంవారు నాకు సంవత్సరానికి అరవై రూపాయిల పెన్షన్ ఇస్తున్నారు. రెండుసంవత్సరాల పెన్షన్ ఒకసారే యిచ్చారు. ఖజానానుండి డబ్బు తెస్తున్నాను. నాకు తెలియకుండానే ఎక్కడో పడిపోయినయ్. ఎనిమిది నవరసులు."

"అవి మీకు దొరికితే ఏమిస్తారు?"

"ఎక్కువివ్వలేను. వాటిలోంచి యాభై రూపాయలిస్తాను."

"రూపాయలేం చేసుకోను? వాటికంటె మంచి వస్తువేదయినా యివ్వు"

"అమ్మా! ఇంకా యేమిచ్చేది? బ్రతికి వున్నాళ్లు నీ గొప్పదనాన్నిగూర్చి అందరికీ చెప్పుతాను"

"అక్కరలేదు. దాంతో నాకవసరం లేదు."

"అంతకంటే నాదగ్గరేమున్న దమ్మా?"

"నన్నాశీర్వదించు నాభర్త జబ్బుతో వున్నాడు. ఆయన ఆరోగ్యవంతుడయేట్లు ఆశీర్వదించు."

"ఆయన కీడబ్బు దొరికిందా."

వృద్ధురాలు మోకాళ్లమీద కూర్చొని రెండు చేతులూ చాచి "దేవీ! వారికి శుభం కలుగజెయ్యి" అని ప్రార్థించింది.

భామ తిరిగి దేవివంక చూచింది. ఆ దివ్యరూపంనుండి ప్రేమ ప్రకాశిస్తున్నది. కళ్లు ఆనందాన్ని వర్షిస్తున్నయ్. భామ హృదయంలో ఏదో స్వర్గంనుండి యీధ్వని వినిపించింది. "వెళ్ళు. నీకు శుభం కలుగుతుంది."

## 6

సాయంసమయం. వ్రజనాథ్‌తోపాటు భామ ఎక్కాలో కూర్చొని ఆమెసొమ్మును ఆమెకు యివ్వటానికి తులసి ఇంటికి వెళ్తున్నది. వ్రజనాథ్ పడిన కష్టమంతా డాక్టరుగారికి పారితోషికంగా సరిపోయింది. భామ పొరుగింటామె దగ్గర చెవి లోలాకులమ్మేసి డబ్బు తీసుకొచ్చింది. క్రొత్తగా లోలాకులు తీసుకొచ్చినప్పుడు అంతులేని ఆనందం పొందింది. వాటి నమ్మేప్పుడు అంతకంటె ఎక్కువ ఆనందాన్ని పొందింది.

వ్రజనాథ్ ఎనిమిది నవరసులను చూపించినప్పుడు ఆమె ఎంతో ఆనందాన్ని పొందింది. కాని ఆ సంతోషం ఆమె ముఖంలో ద్యోతకం కాలేకపోయింది. ఈ రోజు, ఆ నవరసుల్ని తిరిగి యిచ్చేప్పుడు ఆమె హృదయానందం కళ్ళల్లో మెరుస్తున్నది; పెదవులపై నాట్యం చేస్తున్నది; చెక్కిళ్ళకు క్రొత్తరంగును కూరుస్తున్నది. అవయవాలన్నీ పులకింతుతున్నయ్. అది ఇంద్రియానందం. ఇది ఆత్మానందం. ఆనాటి ఆనందం సిగ్గుచాటున దాగివున్నది. ఈనాటి ఆనందం గర్వంతో బహిర్గతమవుతున్నది.

తులసి ఆశీర్వాదం సఫలమయినది. నేడు మూడు వారాలతర్వాత వ్రజనాథ్ దిండు కానుకొని కూర్చోగలిగాడు. మాటిమాటికీ భామను ప్రేమపూర్వకంగా చూస్తాడు. ఆమె తనకు దేవతలాగా కనిపిస్తున్నది. ఇంతవరకు అతడు ఆమె బాహ్య సౌందర్యాన్ని మాత్రమే చూచాడు. ఈనాడు ఆమె హృదయ సౌందర్యాన్ని చూస్తున్నాను.

తులసి యిల్లు ఒక సందులో వున్నది. ఎక్కా బండి రోడ్డులో ఆగింది. వ్రజనాథ్ బండి దిగి, కర్ర పట్టుకొని, భామ భుజాన్ని ఆధారంగా చేసుకొని నడుస్తూ తులసి ఇంటిని చేరాడు. తులసి డబ్బు తీసుకొని రెండు చేతులు చాచి "దుర్గాదేవి మీకు శుభంకలుగజేయు గాక' అని ఆశీర్వదించింది.

వర్షంపడిన తరువాత ఆకులు విప్పారినట్లుగా తులసి కళాహీనమయిన ముఖం విప్పారింది. విషాదచ్ఛాయలు నశించిపోవటం కనిపించింది. ఆమె శరీరమంతా ఒక్కసారి వ్యాకోచించింది.

వ్రజనాథ్ తిరిగివచ్చి ఇంటి గుమ్మందగ్గర కూర్చున్నాడు. ఇంతలో గోరేలాల్ వచ్చి ప్రక్కన కూర్చున్నాడు. వ్రజనాథ్ ముఖం త్రిప్పుకున్నాడు.

"ఆరోగ్య మెలావుంది? అన్నగారూ?" అన్నాడు గోరేలాల్.

వ్రజ: చాలా బాగున్నాను.

గోరే: నన్ను క్షమించండి. మీ డబ్బు తిరిగి యివ్వటంలో ఇంత ఆలస్యం జరిగినందుకు చాలా విచారిస్తున్నాను. మొదటి తేదీనాడే ఇంటిదగ్గరనుండి జరూరయిన వార్త వచ్చింది. యేదో విధంగా మూడు నెలల సెలవు సంపాదించి అక్కడికి పారిపోయాను. అక్కడి కష్టగాథలు చెబితే సమాప్తంగావు. మీ అనారోగ్య సమాచారం విని పరుగెత్తుకుంటూ వచ్చాను. ఇదిగో డబ్బు! తీసుకోండి. సిద్ధంగా వున్నది. జరిగిన ఆలస్యానికి చాలా సిగ్గుపడుతున్నాను.

వ్రజనాథ్ కోపం శాంతించింది. వినయంలోని ప్రభావం! "ఔనండి జబ్బుపడ్డమాట వాస్తవమే. కాని ఇప్పుడు బాగున్నాను. మీకు కష్టమేదయినావుంటే డబ్బు మరలా యివ్వకుగాని." అన్నాడు.

"నే నిప్పుడు ఋణవిముక్తుడ నయినాను. యేవిధమయిన తొందర లేదు."

గోకులాల్ వెళ్లిపోయిన తర్వాత బ్రజ
భాన్ డబ్బు తీసుకొని ఇంట్లోకిపోయి
"ఇవిగో, నీ రూపాయలు - తీసుకో. గోకు
లాల్ యిచ్చివెళ్లాడు." అన్నాడు.
శ్యాము:- ఇవి నా రూపాయలుగావు.

తులసివి. ఒకసారి పరాయిసొమ్ము దాచి
చూచాడు.
"తులసి డబ్బంతా తిరిగి యిచ్చేశావు
గదా!"
"ఇచ్చేస్తే యేమయినట్లు? ఇవి ఆమె

ఆశీర్వాదానికి కానుక."
"చెవుల లోలాకులు ఎక్కడినుండి
వస్తయ్?"
"లోలాకులు లేకపోతే మానె. ఎప్పటికి
చెవు లుండిపోయినయ్!" ★

---




అందే నారాయణస్వామి

ఉదయం పదకొండుగంట లవుతుంది. ఓ చిన్న కుర్రవాడు చేతులో పలకతో బడినుంచి ఆ వీధినే ఇంటికి వెళ్తున్నాడు. వయసు ఆరేళ్లుంటవి. బ్లూరంగుచెడ్డీ తెల్ల చొక్కా తొడుక్కున్నాడు. ఓ గుమ్మంలో నిలబడి యెవరికోసమో నిరీక్షిస్తున్న స్త్రీ, వస్తున్న ఆ కుర్రవాడు సమీపించగానే గడపమెట్లు దిగి ఆప్యాయంగా "బడినించి వస్తున్నావా సూర్యం" అంటూ ఆ కుర్రవాణ్ణి యెత్తుకుని "మామ్మే, మా నాయనే" అని ముద్దులు కురిపిస్తూ లోనికి తీసుకెళ్ళింది. చంకలోవున్న సూర్యం ఆమెకు కురిపించే ముద్దులకు ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు. ఆమెను తానిదివరకెన్నడూ చూడలేదు. తమ యింటికైనా ఆమె యెన్నడూ రాలేదు. యీమె యెవరబ్బా అనుకుంటున్నాడు సిగ్గుతో తలవంచుకుని సూర్యం. ఆమె సూర్యాన్ని లోనికి తీసుకెళ్ళి కాసేపు యెత్తుకుని బిస్కత్తుల పొట్లాం యిచ్చింది. సూర్యం అది తింటూ సంతోషంతో యిల్లు చేరుకున్నాడు. సూర్యానికి తల్లీ తండ్రి లేరు. నాయనమ్మ, ఓ విధవ మేనత్త వున్నారు. నాయనమ్మ సూర్యంచేతిలో బిస్కత్తులు చూసి "యెక్కడివిరా" అని అడిగింది. అవతల వీధిలో యెవరో యిచ్చారని జవాబు చెప్పాడు. సూర్యం తల్లీ తండ్రీలేని బిడ్డని జాలిపడి సూర్యానికి యెవరైనా యేదైనా పెడుతూవుంటారు. అట్లాగే యెవరో పెట్టారనుకున్నది నాయనమ్మ.

తర్వాత నెలరోజులకు ఇట్లాగే సూర్యం మురిసిపోతూ ఒక చేతిలో రూపాయీ, మరి ఒక చేతిలో మిఠాయి పొట్లాం పట్టుకుని ఇంటికి వచ్చి నాయనమ్మకూ, మేనత్తకూ చూపిస్తూ "నాకు రూపాయి" అంటూ వాళ్ళను వూరించాడు. నాయనమ్మ "ఎక్కడివిరా" అని అడగ్గా "మొన్న బిస్కత్తులు పెట్టిందే! ఆమె యిచ్చింది" అని చెప్పాడు మురిసిపోతూ.

నాయనమ్మ అంత ఆత్మీయులెవరా అని పారచూసింది. తనకు తెలిసినంతవరకూ ఆ వూళ్ళో ఎవ్వరూ కనిపించలేదు "ఎవర్రా ఆమె. వాళ్ళ యిల్లెక్కడ?" అని అడిగింది.

"బడినించి వస్తుంటే రెండో వీధిలోనే అమ్మా" అన్నాడు సూర్యం.

"మీ బడిసందు మలుపు తిరిగాక వీధిలోనా" అని అడిగింది నాయనమ్మ.

"ఊఁ" అన్నాడు సూర్యం.

"అయితే ఆ వీధిలో సత్రంవున్నదిచూడు పెద్ద గచ్చురుగులది దానికి యెటువైపున వాళ్ల ఇల్లు?" అని అడిగింది నాయనమ్మ.

"ఆఁ గచ్చురుగుల యిల్లేనే అమ్మా" అన్నాడు సూర్యం.

అది సత్రమని తెలిసేటప్పటికి ఆమెకు ఏమి స్ఫురించిందోగాని ఆముదం తాగిన ముఖంపెట్టి "వాళ్లు పిల్లల్ని పట్టుకెళ్ళేవాళ్లురా! అది సత్రం. అందులోకి అనేక రకాలవాళ్లు చేరుతూవుంటారు. దొంగలు యిట్లాగే అదీయిదీయిచ్చి పిల్లల్ని యెత్తుకెళతారుగాని యిక నువ్వు అటువైపు వెళ్లబోకు నాయనా" అని చెప్పింది నాయనమ్మ.

అందుకు సూర్యం వాళ్ళ నాయనమ్మ లోగడచెప్పిన కథలనుబట్టి దొంగలంటే మసిపాతలు కట్టుకుని కత్తులూ, కటార్లూ పట్టుకుని చూస్తే జడుసుకునేటట్లు వుంటారని తన మనసులో చిత్రించుకున్నాడు. ఇప్పుడు నాయనమ్మ అన్నమాటలు అందుకు న్నంగా కనిపించడంవల్ల "దొంగోళ్ళు అట్లా వుంటారటే అమ్మా! ఆమె మనకు మల్లేనే వున్నదమ్మా! మంచి బట్టలు కట్టుకున్నది, సొమ్ములుకూడా పెట్టుకున్నది. ఆమె యెంత మంచిదనుకున్నావమ్మా!" అన్నాడు సూర్యం మిఠాయి తింటూ.

"నీ మొఖం దొంగలు పిల్లల్ని మాయపుచ్చేందుకు అట్లాగే వేషాలు వేసుకొస్తార్రా నీకు తెలియదు" అన్నది నాయనమ్మ.

"అదికాదమ్మా ఆమె నన్ను యెత్తుకుని యేడ్చిందే! దొంగలు జడిపిస్తారుగాని యేడుస్తారటే అమ్మా?" తన బుద్ధినంతా వినియోగించి వ్యాఖ్యానించాడు సూర్యం.

నాయనమ్మ నివ్వెరపడి "ఏడవనుగూడా ఏడ్చింది. నేను చెప్పలా దొంగవాళ్లు పిల్లల్ని వల్లో వేసుకుంటానికి అట్లాగే కల్లబొల్లియేడుపులు యేడుస్తారు. ఇక ఆమనిషి కనబడి పిలిస్తే వెళ్ళబోకు. వెళ్ళావంటే వీపు పగలకొడతా" అని భయపెట్టింది నాయనమ్మ.

సూర్యానికి తెలియకుండా తల్లీ కూతుళ్లు యేదో మాట్లాడుకుని సూర్యాన్ని ఆ బడికి పంపించకుండా అవతల వీధిలోవున్న మరియొక బడికి పంపడం మొదలుపెట్టారు.

## 2

తొలిఏకాదశి వచ్చింది. నాయనమ్మ, మేనత్త కృష్ణకు స్నానానికి వెళుతూవుంటే సూర్యంకూడా బయలుదేరాడు. ఇరుగు, పొరుగువాళ్లుగూడా వెళుతూవుండగా అంతా కలిసి బళ్లు కట్టించుకుని తెల్లవారేసరికి సీతానగరం వెళ్లారు.

దేవాలయాన్ని ఆనుకుని కృష్ణానది ప్రవహిస్తున్నది. బాల సూర్యుని లేత కిరణాలు ఆలయ గోపురానికి బంగారుపూత పెడుతున్నవి. కృష్ణాతీరమంతా జనంతో కిటకిటలాడుతూవున్నది. స్నానాలు చేసేవాళ్లకూ, స్నానాలుచేసి ఒడ్డుకు వచ్చి టెంకాయ కర్పూరం పట్టుకుని దేవాలయంలోకి వెళ్లేవాళ్లకూ విసుగూ, విరామం లేదు. సూర్యం నాయనమ్మా వాళ్ళు స్నానాలుచేసి మంత్రాలుచెప్పిన బ్రాహ్మడికి దక్షిణ సమర్పించుకుని ఒడ్డుకువచ్చి టెంకాయ

కర్పూరం పట్టుకుని దేవాలయం సమీపించి లోపల జనసమ్మర్దంగా వుండటంవల్ల సూర్యాన్నీ, పక్కయింటివాళ్ల కుర్రవాణ్ణి ఇద్దర్నీ ధ్వజస్తంభందగ్గర నిలుచోమని చెప్పి వాళ్లంతా దేవాలయంలోకి వెళ్ళారు. ఇద్దరు పిల్లలూ ధ్వజస్తంభం దిమ్మదగ్గర నిలబడి దేవాలయంమీదా, అవతల గాలిగోపురం మీదా వున్న విగ్రహాలను వింతగా చూస్తున్నారు.

"ఇక్కడున్నావేం నాయనా" స్త్రీ గొంతు వినపడ్డంవల్ల సూర్యం అటువైపు చూశాడు. వెనకటి ఆమె. ఆమె తన చేతిలో హారతిపళ్లెం ధ్వజస్తంభం దిమ్మ మీద పెట్టి సూర్యాన్ని ఎత్తుకున్నది ఆమె వాక్కులో ఏమి ఆకర్షణ వున్నదోగాని సూర్యానికి నాయనమ్మ చెప్పినమాటలు ఏమీ పనిచెయ్యలేదు. సూర్యం ఆమె చంకలో ఎక్కి కూర్చున్నాడు.

"అమ్మవెంట వచ్చావా సూర్యం?" యీ మాటలు అంటూవుంటే ఆమె కళ్లవెంట బొటబొట నీళ్లు కారినవి. అందుకు సమాధానంగా "ఊఁ" అన్నాడు సూర్యం.

ఇంతట్లో స్వామికి హారతియిచ్చి నాయనమ్మ వాళ్లు అక్కడకు వచ్చారు. నాయనమ్మ ఆ స్త్రీ సూర్యాన్ని యెత్తుకోడం చూసి మండిపడుతూ "ఎవతివే నువ్వు వాణ్ణెత్తుకున్నావు" అని కేకలువేసింది. పాపం! ఆమె చిన్నపుచ్చుకుని మారుమాట్లాడకుండా సూర్యాన్ని దించి కళ్లు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

నాయనమ్మ సూర్యం రెక్కపట్టుకుని "నిలవమన్నచోట నిలవడమ్మా పాడుపిల్లడు యివ్వాళ నన్ను వదిలిపెట్టి కదులు నీ పని చెపుతా" అంటూ బసచేసిన గుడిముందు తోటలోకి తీసికెళ్ళింది.

ఆ తోటలో చెట్లకింద చాలామంది యాత్రికులు వంట చేసుకుంటున్నారు. ఒకవైపున సూర్యం నాయనమ్మా, కలసివచ్చిన యిరుగు పొరుగువాళ్లు ఎడంవెడంగా పొయ్యిలుపెట్టి వంటచేసుకుంటున్నారు.

సూర్యం, తన జతగాడు రామం యిద్దరూ అల్లరిచెయ్యకుండా నిమ్మచెట్టు కుదుళ్లో కూర్చుని చెట్ల సందుల్లోనుంచి, దూరాన్నించి కనిపిస్తున్న కృష్ణాబ్రిడ్జీని, దానిపై నడుస్తున్న జనాన్ని వింతగా చూస్తున్నారు. రామం అమ్మమ్మవాళ్ళదగ్గరకి వచ్చి రొండిన చెయ్యి పెట్టుకుని "బుద్ధిమంతుల్లా కూర్చున్నార్రా యిద్దరూ! యివాళ్ళ ఏకాదశి కదు మరి" అన్నది. బుద్ధిమంతుల పేసరికి వాళ్ళ ముఖాలమీద గర్వంతో కూడిన చిరునవ్వు మొలకలెత్తింది.

"అయితే సూర్యం యిందాక మీ అమ్మ ఎత్తుకుని యేమన్నదిరా?" అని అడిగింది అమ్మమ్మ.

సూర్యం వాళ్ల నాయనమ్మను అమ్మా అని పిలిచే వాడుక. అందువల్ల సూర్యం "అమ్మ యిప్పుడు ఎత్తుకున్నది" అన్నాడు.

"ఇందాకరా ధ్వజస్తంభందగ్గర నిన్ను ఎత్తుకున్నది మీ అమ్మేగా నీకేం తెలుసు పాపం! బంగారంవంటి బిడ్డను వదిలిపెట్టి పోవడానికి దానికి మనసెట్లా వప్పిందో" అంటూ మెటికలు విరిచింది అమ్మమ్మ.

సూర్యం చిన్నప్పటినుంచి వాళ్ల నాయనమ్మనే అమ్మనుకుని వ్యవహరిస్తున్నాడు.




వేళ అమ్మ వున్నదని వాడికి తెలియదు అయితే లోగడ సూర్యం బడినుంచి వస్తూ వుంటే ఆమె తొలిసారి కనిపించి పలకరించినప్పుడే ఏదో అనిర్వచనీయమైన అనురాగబంధం ఆ లేత హృదయాన్ని పెనవేసుకున్నది. ఇప్పుడీ అమ్మమ్మ ఆమే సీతల్లని చెప్పేటప్పటికి వాడి హృదయానికి సూటిగా తాకుతుపోయి తనకు తెలియకుండా ఎదురు చూస్తున్న అమూల్యమైన దేదో లభ్యమై నట్లయింది.

సూర్యం ఒక్క గంతుతో వాళ్ల వంట చేసుకునే చోటుకి వచ్చాడు. నాయనమ్మ లేదు నీళ్లకు వెళ్ళింది. మేనత్త వున్నది "ఇందాకటి ఆమె మా అమ్మేనట గా అత్తయ్యా?" అని అడిగాడు.

వాళ్లు ఏ విషయం అయితే వాడికి తెలియకూడదనుకున్నారో అదే వాడికి తెలిసిపోయింది మేనత్త కఠినస్వరంతో "ఎవరు చెప్పార్రా నీకు" అన్నది.

"అమ్మమ్మ చెప్పిందిలే! రాముం అమ్మ వాళ్ళ యింట్లోనే వుంటుంది. మా అమ్మ మన యింట్లో యెందుకు వుండదత్తయ్యా?" అని అడిగాడు సూర్యం

"వట్టిదేరా మీఅమ్మఅయితే మనయింట్లో ఎందుకు వుండదు?" అని సర్ది చెప్పింది మేనత్త

ఇంతలో బిందె యెత్తుకుని నాయనమ్మ వచ్చింది సంగతి విన్నది. సూర్యాన్ని తల్లి మభ్యపెట్టి ఎక్కడ ఎత్తుకెళుతుందోనని అసలే ఆమెకు భయం. సూర్యానికి చెప్పిన వాళ్ళను మాజావాణిగా శాపనార్థాలు పెడుతూ సూర్యానికి విరుగుడుమాటలు చెప్పిందిగాని వాళ్లు ఎన్ని చెప్పినా సూర్యం మనసులో పడిన ముద్రను తుడిచి వెయ్యలేకపోయారు.

భోజనాలయ్యాక వచ్చిన బళ్ళమీదనే సాయంత్రానికల్లా అంతా యిల్లు చేరుకున్నారు

మర్నాటినుంచీ సూర్యానికి జ్వరం వేసుకున్నది. చెయ్యివేస్తే పేలగింజలా వేగిపోతున్నది. ఒకటే పలవరింతలు నాయనమ్మ వైద్యుణ్ని పిలిపించి మందిప్పిస్తున్నది గాని జ్వరం తగ్గలేదు.

అది ఆరవరోజు ఎన్ని మందు లిచ్చినా సూర్యానికి జ్వరం పెరుగుముఖమే గాని తగ్గుముఖం పట్టలేదు నాయనమ్మ, మేనత్తా భయపడజొచ్చారు ఆరోజు దీపాలు పెట్టాక కుర్రవాడికి జ్వరం తగులుతున్న సంగతి తెలుసుకుని ఆమె వాళ్ళింటికి వచ్చింది సూర్యం నాయనమ్మ యింట్లో లేదు. ఆ యింటికి ఆవిడ లంకిణి అత్తంటే ఆమెకు తగని భయం. ఆమె వెళ్ళిపోవడానికి అత్త గూడా కారణమని అంతా చెప్తుంటారు అత్త యింట్లో లేకపోవడం కనిపెట్టే ఆమె వచ్చివుండవచ్చు ఆమె లోనికి వెళ్లి మంచం మీద పడుకునివున్న సూర్యాన్ని పలకరించి ఎక్కువ ఆలస్యం చెయ్యకుండా అత్త ఎక్కడ వస్తుందోనని వెళ్ళిపోతూండగా వీధిగుమ్మంలోకి అత్త ఎదురుగా రానే వచ్చింది. ఆమెను చూచి అత్త మండిపడుతూ "సిగ్గులేకుండా ఏ ముఖం పెట్టుకొని నా గడపతొక్కావే, ఏమంటూ నీ పాడుచెయ్యి వాడి వంటిమీద వేశావో అప్పటినుంచి బిడ్డ అసలే జ్వరంతో ఏడుస్తుంటే మళ్ళా తయారయ్యావు! వాణ్ణి గూడా మింగివెయ్యదలుచుకున్నావా!" అని కేకలు పెట్టింది. ఆమె ఏమీ మాట్లాడకుండా కళ్ళనీళ్లతో వెళ్లిపోయింది.

అదేమిటోకాని ఆ మర్నాటి నుంచే సూర్యానికి జ్వరం తగ్గుముఖం పట్టింది. జ్వరం పూర్తిగా తగ్గిపోయి బాగా కోలుకునేసరికి వారం పదిరోజులు పట్టింది

## 3

కాలచక్రం గిర్రున తిరిగింది. సూర్యం పెద్దవాడయ్యాడు. పద్దెనిమిదేళ్లు వచ్చినవి వాళ్ళది పేద సంసారం నాయనమ్మ, మేనత్తా [illegible]లూ, చక్రాలూ మొదలైనవి చేసి అమ్ముతుంటారు. దానివల్లనే వాళ్ల జీవనం. మేనత్తకు అత్తవారితరఫున వచ్చిన ఓ యకరం పొలం వున్నదిగాని అది సరిగా పండదు. సూర్యం ఫిఫ్త్‌ఫారంవరకు చదివి బడి మానివేసి ఓ షాపుకారుకొట్లో నెలకు నలభై రూపాయల జీతంమీద గుమాస్తాగా చేరాడు.

సూర్యం షాపుకారు పనిమీద గుంటూరు వచ్చాడు. బజార్లో పనిచూసుకుని మరి ఒక కమీషనుకొట్టుకు [illegible] కమీషనుకొట్టు అక్కడికి రెండు ఫర్లాంగులదూరంవుంటుంది బజా[illegible] తిరిగి ఓగల్లీలో నడుస్తున్నాడు "[illegible] అన్న పిలుపు వినబడ్డది అది [illegible] వీధి అక్కడ తనని పిలిచేదెవరా [illegible] వారి నెవర్నో పిలుచుకుంటున్నారో అనుకుని సూర్యం తలవంచుకుని వెళ్ళిపోతున్నాడు "నాయనా సూర్యం" ఈసారి దగ్గరగా వినపడ్డది. ఆగి వెనక్కు తిరిగి చూశాడు ఆమె ఓ గుమ్మంముందు నిలుచుని వుంది. సూర్యం యిప్పుడు పెద్దవాడై సంఘంలో ఒకడైపొయ్యాడు సంఘ మర్యాదలూ, సంఘ నియమాలూ వంటపట్టినవి. వెళ్లడానికి అతనికి మనసొప్పలేదు. తచ్చాడుతున్నాడు. ఆమె "రా నాయనా" అంటూ అతనివైపు నాలుగడుగులు వేసింది. సూర్యానికి ముందుకు అడుగు పడలేదు. మంత్రబద్ధునివలె ఆమె ఇంటికి వెళ్లాడు.

అది ఒక డాబా హాల్లో చాప పరచి వున్నది. ఆమె "కూర్చో నాయనా" అన్నది. పరచివున్న చాపమీద సూర్యం ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నాడు. ఇంట్లో ఎవరూ వున్నజాడలేదు గోడన పటానికి ముందు చెక్కమీద పూజాద్రవ్యాలూ, వెలుగుతున్న అగరవత్తులూ వున్నవి. అవతల గోడన యింకా ఏవో దేవుళ్ళపటాలు తీర్చి వున్నవి.

ఇంతలో ఓ వ్యక్తి వచ్చి "యివాళ బేంకీలో ప్యాసుకు డబ్బుకట్టి సరుకు డిలివరి తీసుకోకపోతే రైల్లో డెమరేజీ తగులుతుందమ్మా" అని చెప్పాడు. ఆ వ్యక్తి ఆమె గుమాస్తా ఆమెకు బజార్లో ఒక సైకిలుషాపు వుంది "డబ్బు ఆనిక్కి నేను పట్టుకవస్తాలే" అని చెప్పి అతణ్ని పంపివేసింది.

ఆమెగూడా చాపమీద కూర్చుని "గుమాస్తాగా వుంటున్నావటగా నాయనా, నెలకెంతిస్తారు?" అని అడిగింది.

తను గుమాస్తాగా వుంటున్న సంగతి ఆమె కెట్లా తెలుసు! మనసులో అనుకుని "నలభై రూపాయలు" అన్నాడు తల వంచుకుని ముక్తసరిగా సూర్యం

ఎదురుగా చెట్టుమీద కాకి గూట్లో తన పిల్లలకు ముక్కుతో మేతపెడుతున్నది. పక్కయింట్లోనుంచి ఆవు తన లేగదూడకోసం అంబా అని అరుస్తున్నది. ఆమె కళ్ళవెంట అప్రయత్నంగా బొటబొట నీళ్లు కారినవి. తనచేతులమీదుగా పెరగవలసిన బిడ్డ తనయింటికి వచ్చినప్పుడైనా చేతులారా ఒక్కపూట యింత అన్నం పెట్టుకొనే భాగ్యం తనకు లేదు భగవానుడా! నా పాపానికి యింతకంటే శిక్ష నీకు కనిపించలేదా? కోయిల కాకిగూట్లో గుడ్లుపెట్టి

# ★ అమ్మ ★

ఆ మనిషి కొత్తవాడు. "ఏమిటా పని యిక్కడ చెప్పకూడదు?" అన్నాడు సూర్యం.

"బాబ్బాబూ! నాలుగడుగులు వెయ్యండి నీతో పనివున్నది" అంటూ అవ్యక్తి సూర్యాన్ని వెంటపెట్టుకుని సత్రంలోకి తీసుకువెళ్లాడు. అక్కడ ఓగదిలో ఆమె కూర్చొనివున్నది. సూర్యం చూసి నిర్ఘాంతపొయ్యాడు. బుగ్గన కాటుక, కాళ్ళకు పారాణి పెళ్ళికొడుకు వేషంలో వున్న సూర్యాన్ని చూసేసరికి ఆమె ముఖం విప్పారింది. కళ్ళపండగ్గా అతనికేసి చూస్తూ "కూర్చొ నాయనా" అన్నది. సూర్యం విధిలేక పరిచివున్న చాపమీద కూర్చున్నాడు.

"రేపేనటగా నీపెళ్ళి సూర్యం!" అని ఆమె అతని జవాబుకు ఎదురుచూడకుండానే "పాపిష్టిదాన్ని నీ పెళ్లి కళ్ళారా చూసుకునే అదృష్టం నాకులేదు" అంటూ ఆమె కంట తడిపెట్టింది. ఓనిమిషం ఆమె మౌనం వహించింది. తర్వాత "యీ శుభసమయంలో నేను నీకు చేయదగినది యిది ఒక్కటే" అంటూ వందరూపాయలకాగితాలు రెండు సూర్యానికి యివ్వబోయింది. సూర్యం తీసుకోడానికి వెనకాముందు ఆడుతూవుండగా "తీసుకో నాయనా నేనేం పరాయిదాన్ని కాదు. యీ శుభకార్యం అంతా నా చేతులమీదుగా జరగవలసినది. యేజన్మలో తల్లీబిడ్డలకూ యెడబాటు చేశానో, యీ జన్మలో అనుభవిస్తున్నాను" అంటూ నోట్లురెండూ సూర్యం చేతిలో పెట్టింది. సూర్యం కళ్లవెంట అప్రయత్నంగా రెండు కన్నీటిబిందువులు రాలినవి. ఆ వాతావరణంఅంతా విషాదంతో నిండిపోయింది. నోట్లుపుచ్చుకుని సూర్యం లేచాడు.

పెండ్లి సక్రమంగా జరిగిపోయింది. పెండ్లి రెండురోజులూ ఆమె సత్రంలోనే, వుండి ఆనందించగలిగినంతవరకు, ఆనందించి తర్వాత స్వగ్రామం వెళ్లిపోయింది.

## 5

రెండుసంవత్సరాలు గడిచిపోయినవి. సూర్యానికి కుమారుడు కలిగాడు. సూర్యం నాయనమ్మ యిల్లూవాకిలి వదిలిపెట్టి యమధర్మరాజు ఆహ్వానంమీద వెళ్ళిపోయింది. నాయనమ్మ పోవడంలో వాళ్ళ తినుబండారాల వ్యాపారం పడిపోయింది. సూర్యం ఒక్క రెక్కమీదనే సంసారం గడవటం, యిదివరకంటే జీతం పెరిగినా నెలవచ్చేవరకూ అస్తుబిస్తుగానే వుంటున్నది. అట్లాగే సూర్యం సంసారం నెట్టుకొస్తున్నాడు.

ఒకరోజు మధ్యాహ్నం సూర్యం కొట్టువద్దనుంచి వచ్చి భోజనంచేసి ముందు వసారాలో కూర్చునివుండగా పోస్టుజవాను కవరు యిచ్చి వెళ్లిపొయ్యాడు. సూర్యం కవరుచింపి చదువుకున్నాడు. అది ఆమె దగ్గరనుంచి వచ్చినది. అందులో సారాంశం యిది—తనకు జబ్బుగా వున్నదని, బ్రతికే ఆశ లేదనీ, ఒకసారి సూర్యాన్ని చూడాలని వున్నదని, తక్షణం బయలుదేరి రావలసిందనీ వ్రాసివున్నది. సూర్యం వుత్తరం చదువుకుని వూరుకున్నాడు. వెళ్ళలేదు.

నాలుగు రోజులతర్వాత సూర్యం రాత్రి పెద్దింటికల్లా కొట్టుదగ్గరనుంచి వచ్చి ముందు వసారాలో చాపపరుచుకుని కూర్చుని లాంతరు దగ్గర పెట్టుకుని యేవో కాగితాలు జేరీజులు వేస్తున్నాడు.

ఇంతట్లో వాకిటిముందు బండివచ్చి నిలిచింది. ఆమె బండిలోనుంచి దిగింది. వెంట ఎవరో స్త్రీ వున్నది. ఆమె ఆస్త్రీని వూనిక చేసుకుని నడవలేక నడుస్తూ లోపలకువచ్చి సూర్యం దగ్గరగా గోడకుచేరగిలబడి కూర్చున్నది. "నీకు నేను వ్రాసినవుత్తరం చేరే వుంటుంది. ఒకళ్ళక్రింద వున్నవాడివి. అన్నిపనులూ వదిలిపెట్టి రావాలంటే ఎట్లా వీలౌతుందని నిన్ను చూసివెళదామని నేనే వచ్చాను నాయనా" అన్నది. ఆమెశరీరం శుష్కించిపోయింది. ఆయాసంతో మాట్లాడలేక పోతున్నది.

"ఎప్పుడూ నిన్నే కలవరిస్తూ వుంటుంది. బాబూ" అన్నది వెంటవచ్చిన స్త్రీ.

ఆమె అన్నది "నేను యిక జీవించను నాయనా! యిల్లూ వాకిలీ నాకున్న ఆస్తి అంతా నీపేర పెట్టాను" అంటూ కాగితాలు సూర్యంముందు వుంచింది. క్షణం ఆగి "నాదొక కోరిక నాయనా! నేను చనిపోయిన తర్వాత మీ అమ్మను తలచుకుని నువ్వు రెండు కన్నీటి బిందువులు విడవగలిగితే నేను తరిస్తాను. అదే నా కడసారి కోరిక" అంటూ ఆమె లేచి నిలుచున్నది.

ఆమె వెనుకటికి యిప్పటికి యేమాత్రం పోలిక లేదు. మనిషి శుష్కించిపోయింది. కళ్లు దించుకుపోయి ముఖం పాలిపోయింది. సూర్యం ఆమెను ఆ స్థితిలో చూసేసరికి అతనిలో అణగివున్న ప్రేమ, యుగయుగాల నుండి తల్లీ బిడ్డలమధ్య యిమిడివున్న మమకారం, ఒక్కసారుగా పొంగి గట్లుతెంచుకుని ప్రవహించింది. తన తల్లి యిక వుండదు. ఆమె బాగావుండగా ఆమె ప్రేమను చూరగొనలేని అభాగ్యుణ్ని. ఆమె యెంత బుజ్జగించినా లక్ష్యపెట్టని మందమతిని. సూర్యంకళ్ళవెంట బొటబొట నీళ్ళుకారినవి. అప్రయత్నంగా గొంతెత్తి "అమ్మా!"అన్నాడు. యేదీ అమ్మ? ఆ పిలుపు ఆమెకు అందలేదు వెళ్ళిపోయింది. ★

# సంపద తెచ్చిన సంతాపం

## ఆర్. వి. జి. కృష్ణమూర్తి

రామానందం యింట్లో కాలెడుతూండగానే రెండు జాబులు కనిపించాయి టేబిల్ మీద. ఒకటి పజిల్స్ కంపెనీ కవరు. ఫస్ట్ ప్రైజయితే టెలిగ్రామే వచ్చివుణ్ణు! ముందు ఆ కవరే చించాడు.

"నాలుగు తప్పుల్లో వున్నారు. యీ దఫా ప్రయత్నించండి. విజయము మీదే కావచ్చు. పజిల్ కూపన్లు కూడా యింగులో పంపుచున్నాము" అని వ్రాసివుంది.

కంపెనీవాళ్ళ మీద లోపల ఎంతో కోప్పడ్డా బయటికి సంతోషంగా వున్నట్టే నటించాడు. ఇంట్లో అందరూ తన యీ ఒక్క పనిని వేలెత్తి చూపేవారే. యింట్లో ఏవస్తువు లేకున్నా "వెధవపజిల్సు. డబ్బంతా వీటికే సరిపోయె" అనే వాళ్ళు. పెద్దన్నయ్య నెలకు రెండువందలాయాభై, తాను ఓవందాయాభై తెస్తున్నారాయె. పైగా నాన్న పెన్షనో వందా పాతిక వస్తుంది ఇంట్లో అన్ని ఖర్చుల్లోనూ తన పజిల్సే పెద్ద ఖర్చు వీళ్ళకి. తనలో ఏదైనా లోపం చూపాల్సి వస్తే అమ్మగాని, నాన్నగాని యీ పజిల్సుతోనే మొదలెడ్తారు.

ఇక భార్య—రూపవతి - పరమ శత్రువు (యీ విషయంలో మాత్రమే) — "యీ పజిల్సుకు పెట్టేడబ్బుతో ఒక నెక్లెస్ వచ్చి వుండును" అనేది.

రామానందానికి యింట్లో అందరిమీదా ఎంతో కసిగా వుంది. "వెధవది...ఒక్కసారైనా ఏదో కొంత డబ్బొంటూవస్తే వీళ్ళ నోళ్లు కట్టేద్దును" అనుకుంటూ అప్పుడప్పుడూ. కాని ఒక్కసారైనా వచ్చిన పాపాన పోలేదు. తన పేరుతో కడితే రావడం లేదని భార్య పేరుతో కట్టాడు. అమ్మ, నాన్న, అన్నయ్య-అందరి పేర్లతోను కట్టి చూచాడు. ఊహూ! లాభం లేకపోయింది.

ఇక రెండో జాబు. నెల్లూర్లో వుండే తన చెల్లెలు అనూరాధ దగ్గర్నుంచి క్షేమ సమాచారాలు... విశేషాలేమీ లేవు ... పాపం - పిచ్చిపిల్ల...రామానందం అంటే ఎంతో ప్రేమ. అమ్మకుగాని, నాన్నకుగాని, పెద్దన్నయ్యకుగాని ఎవ్వరికీ వ్రాయదు జాబులు; ఒక్క రామానందానికి తప్ప. "దాని బ్రతుకూ ఏమంత బాగులేదు. బావ గవర్నమెంటు ఆఫీసులో గుమాస్తా. వచ్చే జీతం విలాసాలకు చాలకపోయినా భుక్తికి బాగానే గడుస్తుంది. బావకు పిచ్చికోపం. అహంభావం-అహంకారం. ఆడదంటే అలుసు - అనూరాధంటే యీర్ష్య-ఎందుకో! అతన్ని అత్తగారింట్లో అందరూ ఎంతో మర్యాద చేస్తారు అతని గుణం తెలుసుకొబట్టి వేళాకోళాలైనా ఎక్కువగా చేయరు. ఇంత యిదిగా వున్నా అతనెందుకో చాలా కష్టపెడతాడు. భార్యనూ, అందర్నీ కష్టపెడుతున్నాడు.

ఈసారి ఏమైనాగాని, అనూరాధ పేరుతో పజిలు కట్టాలనుకున్నాడు. తక్షణమే కట్టాడు. ఆ మరుక్షణమే జాబు అనూరాధకు వ్రాయనూ వ్రాశాడు.

"అమ్మాయ్. నాకు అదృష్టం లేదని తేలిపోయింది. నాకే గాదు. ఈ యింట్లో ఎవ్వరికీ లేదు. వీళ్ళ ఎవ్వరి హృదయాలూ మంచివిగావు. నేను పజిల్సు కడుతున్నానని తిడతారు. ఒక్క పెద్దన్నయ్యమాత్రం ఏమీ అనడుగాని "ఎందుకురా యీ దండుగ ఖర్చు" అన్నట్టుగా చూస్తాడు. ఇక నా భార్య-అంటే నీ వదిన-ఎప్పుడూ నెక్లేసో పట్టుచీరో అని గోల— నేను చేసే పనులకు సంతోషించేదానివి నీవొక్కదానివే అమ్మాయ్.

అందుకనే, యీసారి పజిలు నీ పేరుతోనే కడుతున్నా. ఫస్ట్ ప్రైజ్ లక్షా యాభై వేలు. వస్తే....అది నీ అదృష్టమే. నాకు సగభాగం యిస్తావుకదూ అమ్మాయ్"

మీ అన్న
రామానందం.

అన్నయ్యా,

ఒక కడుపున పుట్టిన వాళ్లం. మీ కెవ్వరికీ లేని అదృష్టం నాకు మాత్రం పట్టబోతుందా? అదే వుంటే నా బ్రతుకీ విధంగా వుండేదా?

సరే! ప్రైజంటూ వస్తే సగభాగం ఏమిటే? డబ్బంతా నీదేకదూ. తప్పకుండా యిస్తాను.

నీ చెల్లెలు
అనూరాధ.

* * *

రోజులు దొర్లుతున్నాయి ఒకనెల గడిచింది. ఎనిమిది కొట్టిందే పడకమీదనుంచి లేవని రామానందం ఆ రోజు ఆరింటికే లేవడంతో వాళ్లూ వీళ్లూ ఆశ్చర్యపోయారు. త్వరగా ముఖం కడిగి, కాఫీ త్రాగి పరుగెత్తాడు పేపరుకోసం. ఖర్మ...ఆఖరుకు స్టేషన్లో కూడా దొరకలేదు ఆనాటి పేపరు. వెతికి వెతికి, బస్ స్టాండు చేరగానే ఓ కుర్రాడివద్ద దొరికింది. వాడికి రూపాయి నోటిచ్చి, చిల్లరైనా తీసుకోకుండా అరుస్తూ పరుగెత్తాడు యింటివైపు.

పావుగంట తర్వాత హాల్లో జరిగిన యీ అవసర సమావేశం ముగియగానే రామానందంతల్లి కొడుక్కి దిష్టితీసి వేసింది.

మర్నాడు పత్రికల్లో అనూరాధ రామ్మూర్తితో సహా ఫోటో కనిపించింది.

"మీరీ డబ్బుతో ఏమి చేయదలచుకున్నారు?"

"ఏదైనా వ్యాపారంచేసి స్వతంత్రంగా జీవించదలచుకున్నాం."

"ధర్మకార్యాలకు ఏదైనా వినియోగిస్తారా?"

"ఏదో కొద్దిగా."

ఇలా జరిగిందట అనూరాధతో పజిల్ కంపెనీవాళ్ల యింటర్వ్యూ.

* * *

కలకత్తా మెయిల్లో మూడవ తరగతి పెట్టెలో ఒక మూల రామానందం కూర్చుని కిటికీలోనుండా వెలుపలికి చూస్తున్నాడు. బండి గూడూరు స్టేషను దాటింది. ఇంకెంత? నెల్లూరు ఇరవైనాలుగు మైళ్ళు. గ్రాండు ట్రంకురోడ్డుమీద ఒక కారు రివ్వున వచ్చేస్తోంది. "నీవు ముందా - నేను ముందా" అన్నట్టు మెయిల్ కంటే వేగంగా వెళ్తోంది. కాని ఏం లాభం. లెవెల్ క్రాసింగ్ వద్ద కారు ఆగిపోక తప్పలేదు. అప్పటికి మెయిల్దే గెలుపు చిన్నగా నవ్వాడు రామానందం. నెల్లూరుకు చేరేందుకు నిమిషాలు లెక్కపెట్టడం మొదలెట్టాడు.

హడావుడిగా తలుపుకొట్టి, లోపలదూరి, "కంగ్రాచ్యులేషన్స్ అనూరాధా. దీన్తో మన దరిద్రం పారిపోయింది." అన్నాడు. రామమూర్తి ఏమీ మాట్లాడకుండానే

# ★ సంపదతెచ్చిన సంతాపం ★

ప్రక్కకు తిరిగి పడుకున్నాడు అనూరాధ మాత్రం నవ్వింది.

"అమ్మాయ్ అయితే వాళ్లు డబ్బు యిచ్చేశారా?"

"ఇచ్చారు. అంత డబ్బు మనింట్లో ఎందుకులే అని, బ్యాంకులోనే వుండనిచ్చాం. స్నేహితులూ వాళ్ళూ టీ పార్టీలూ అవీ అంటే ఓ వంద ఖర్చయిందయ్" అన్నది.

మర్నాడు మధ్యాహ్నం బయల్దేరే దాకా మరల డబ్బు ప్రసక్తి ఎత్తలేదు అనూరాధ అంది "డబ్బు తీసుకు పొమ్మని" రామమూర్తి ఏమీ పలక్కుండా ఏదో ఆలోచిస్తున్నాడు

"ఎందుకులే అమ్మాయ్. నాలుగైదు రోజుల్లో మళ్ళీ వచ్చి నిన్నూ డబ్బునూ కూడా తీసుకెళ్తాను." రామమూర్తి వైపు తిరిగి "అప్పుడు నీవూ మా వూరికి రావాలి బావా" అన్నాడు

"చూస్తాంలే అప్పుడు" అని జవాబిచ్చాడు రామమూర్తి వెళ్ళేప్పుడు "వస్తాను బావా" అంటే "ఊ" అని మాత్రం మూల్గాడు. అనూరాధ వీధి గుమ్మంవరకూ సాగనంపింది

శ్రావణ మాసం నోములకు అనూరాధను పిల్చుకెళ్ళేందుకు తల్లితో సహా రామానందం వచ్చాడు తల్లి కూతుర్ని చూచి మురిసిపోయింది. తనింట్లో ఎవ్వరికీ లేదు గదా యింత అదృష్టం! అనూరాధను పెళ్ళిచేసుకున్నందువల్లనే ఇంటర్మీడియట్ తో యుద్ధంచేసిన రామమూర్తి బి. ఏ. మొదటి దఫా ప్యాసయ్యాడు. నిరుద్యోగిగా ఆర్నెల్లయినా గడవకుండానే గవర్నమెంటులో గుమాస్తాగిరి సంపాయించాడు. ఇలా లెక్కవేసుకుంటూ పోతే ఆ కుటుంబానికి జరిగిన మేళ్ళన్నీ గూడా అనూరాధ రామమూర్తిని పెళ్లిచేసుకున్నందువల్లనే ఆ విషయాన్ని అందరూ గ్రహించింరి గూడా అనూరాధకు లక్షాయాభై వేలు వచ్చిన తర్వాతనే. యీనాటికి దేవుడు దయతలచాడు — అని తల్లి ఆనందంతో వచ్చి ఉబ్బి తబ్బిబ్బవుతూంది "ఇంత సంతోషపడుతున్నాను ఏమీ ఆపద రాదుగదా తర్వాత" అని కొత్త నిలదొక్కుకుంది గూడానూ.

ఆ రోజు ఆదివారం. ఎండ తీవ్రంగా వుంది. మధ్యాహ్నం అందరూ భోజనాలు ముగించుకుని తాంబూలాలు వేసుకుంటున్నారు. అంతా కులాసాగా మాట్లాడుతుంటే రామమూర్తి మాత్రం చాలా మితంగా మాట్లాడుతూ, ఏదో ఆలోచిస్తున్నట్టు వుంటున్నాడు. అనూరాధ వట్టివేళ్ల విసనకర్ర మీద చల్లని నీళ్లు చల్లి భర్తకు దగ్గరగా కూర్చుని విసురుతూంటే, రామానందం ఆలోచన వూళ్లోవున్న తన భార్య మీదికి పోయింది తన భార్య ఒక్కనాడైనా యిలా విసరలేదా ఎప్పుడైనా దగ్గర కూర్చుని కులాసా కబుర్లు చెబుతుందనుకుంటే, నగలూ, చీరలూ, డబ్బూ— తప్పితే వేరేవిషయమే మాట్లాడదుగా— ఛీ. ఛీ.

"ఏమిటన్నయ్యా ఆలోచిస్తున్నావు"- రామానందం ఆలోచనలకు భంగంకలిగింది

"ఏమీ లేదమ్మాయ్ కాస్తపడుకోవాలి" తానాలోచిస్తున్న విషయం చెప్పకుంటే తనపరువుకే భంగంకదూ మరి

* * *

నాలుగు గంటలకు బావమరుదు లిద్దరూ షికారుకు బయల్దేరారు. రామమూర్తి "సినిమాకు గాని, లేక అలా ట్యాంకురోడ్డుకు గాని వెళ్దాం" అన్నాడు. రామానందం "పార్కుకు గాని, అలా పెన్నఒడ్డుకు గాని వెళ్దాం" అన్నాడు రామమూర్తికి బజార్లో వాటినీ వీటినీ చూస్తూ తిరగడమంటే సరదా రామానందానికి చల్లటి గాలీ, ప్రశాంత వాతావరణము అంటే ఇష్టం ఆరోజు రామానందమే జయించాడు పెన్నానది వద్దకు నడిచారు.

అప్పటికి నదిలో నీళ్లు లేవు క్రొత్తగా కట్టిన బ్రిడ్జిమీద కొంతదూరంనడిచివెళ్లారు. మరల తిరిగివచ్చి ఇసుకలో కూర్చున్నారు చల్లటి గాలి శరీరాలకి ఎంతో హాయినిస్తోంది జనం చాలా తక్కువగా ఉన్నారు. సమీపంలో నలుగురు పిల్లలు ఇసుకతో ఇళ్ళుగట్టి ఆడుకొంటూ నెత్తినా ముఖాన ఇసుక పోసుకుంటూంటే వాళ్ళ తల్లి దండిస్తోంది ఈ దండనలు వాళ్లు లెక్క చేయలేదు తరుముకుంటూ పిల్లలు పరుగిడుతున్నారు. రైలుబ్రిడ్జిపైన కూత వినబడుతోంది ప్రయాణీకులు కిటికీలోంచి క్రిందికి తొంగిచూస్తున్నారు. పిల్లలు తరుముకుంటున్నారు వాళ్ళక్కయ్య కాబోలు పరుగెత్తుకెళ్ళి లాక్కొచ్చింది.

రామానందం సిగరెట్ పీలుస్తూ ఇవన్నీ చూచి ఆనందిస్తూంటే రామమూర్తి అగ్గిపుల్లతో ఇసుకమీద పిచ్చిగీతలుగీస్తున్నాడు.

చీకటి బడుతూంది. ఇద్దరూ యింటికి బయల్దేరారు. "ఏం బావా! రేపు అమ్మాయిని తీసుకెళ్తాం" అన్నాడు రామానందం

ఏమీ తడుముకోకుండానే రామమూర్తి "ఆహా" అన్నాడు.

"మరి నీవో?"

"వీలుండదోయ్."

"సరే! డబ్బు రేపు బ్యాంకినుంచి తీసుకురావద్దూ" అని అడిగాడు రామానందం, రామమూర్తిని పైనుంచి క్రిందిదాకా చూస్తూ.

రామమూర్తి జేబులోంచి సిగరెట్ పెట్టె బైటికి దీసి "అగ్గిపెట్టె కొంచెం యిలా యియ్య" అన్నాడు

"సరేగాని" యింకా ఏదో చెప్పబోయాడు రామానందం అగ్గిపెట్టె అందిస్తూ.

లాల్చీలోపలికి ఏదో పురుగు దూరిందని దాన్ని బయటికి తీసేందుకు ప్రయత్నిస్తున్నాడు రామమూర్తి జవాబీయకుండానే పురుగు దొరకబోవడం, లాల్చీ సర్దడంతో నెమ్మదిగా రంగనాయకస్వామి దేవాలయం వద్దకు వచ్చారు

"అలా గుడిలోకి వెళ్ళివద్దాం పద" అంటూ లోపలికి దారితీశాడు రామమూర్తి. రామానందానికి అతన్ననుసరించక తప్పలేదు

ట్యాంకురోడ్డుకొచ్చేంతవరకూ ఎవరూ ఏమీ మాట్లాడలేదు ఈ మౌనభావమేమిటో రామానందానికేమీ అర్థం గాకుండా వుంది ఏదో మాట్లాడదామని నోరు తెరిచేలోగా "టెయిలర్ వద్ద బట్టలు కుట్టేందుకిచ్చాను తెస్తానుండు" అని మేడఎక్కాడు రామమూర్తి.

"అతను ఎందుకిలా తప్పించుకొంటున్నాడు! ఎప్పుడు డబ్బువిషయం ఎత్తినా ఏదో విధంగా విననట్లుంటున్నాడు. తనకేదైనా కావాలంటే కావలంటానా తన చెల్లెల్ని చూసైనా యివ్వద్దూ అసలు అనూరాధకు సగం యిస్తానంటేనిగా. తప్పకుండా దానిభాగం యిక్కడే యిచ్చివెళ్తాను" అనుకుంటూండగా రామమూర్తి చేతిలో పొట్లంతో మేడదిగొచ్చాడు

కాస్త కాఫీతాగి వెళ్దామంటూ హోటల్ వైపు నడిచాడు. రామానందం ఏదో అడగబోతున్నాడు ఆ సంగతి రామమూర్తి గ్రహించాడు. చటుక్కున "కొంచెం డికాక్షన్ పట్రా" అని సర్వరుని ఆజ్ఞాపించి నిబ్బరంగా రామానందంవైపు తిరిగాడు. రామానందంముఖంలో నిన్న మొన్నటి కళాకాంతుల్లో విసమెత్తయినా ఆ సమయంలో అగుపించటం లేదు —"ఇదేదో తేల్చేసుకోవాలి యీ ముసుగులో గుద్దులాట ఎంతసేపూ" అని యిద్దరి మనస్సుల్లోనూ వుంది

"ఏమిటి రామానందం ఏదో అడుగుతున్నావు" అన్నాడు సాగదీస్తూ

రామ్మూర్తి. ముఖంమీద తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు కనబడుతూంది

"ఆ! ఏంలేదు. రేపు బాంకీనుంచి డబ్బు తీద్దామని" అన్నాడు రామానందం ఎదుట గోడమీదవుండే ప్రొప్రైటర్ ఫోటో చూస్తూ

"ఎందుకూ?" రామ్మూర్తి బిల్లు నందుకున్నాడు

"అంటే?" రామానందం తెల్లబోయాడు బావగారిధోరణి ఏమీ అర్థం కాలేదు

బిల్లు చెల్లించి బయటపడ్డారు

సిగరెట్లు ముట్టించి బయల్దేరారు

"ఏమిట్రోయ్ రామానందం ఏదైనా అప్పుగా కావాలంటే ఎంతకావాలో చెప్పు" అడిగాడు రామ్మూర్తి అప్పుడే చాలామంది అప్పులు అడుగుతున్నారని, వాళ్ళకందరికీ ఏదోవిధంగా సర్దిచెప్పాననీ, దాంతో కొందరు కోప్పడి తనతో మాట్లాడ్డమే మానుకున్నారనీ, త్వరలో ఏదైనా వ్యాపారం మొదలెట్టాలనీ .. ఏమేమో చెప్పేశాడు రామ్మూర్తి

పిడుగు సరిగ్గా తన నెత్తిన బడ్డటయింది రామానందానికి. కొంతవరకూ విన్నాడు. కొంత వినిపించనేలేదు బుర్ర వేడెక్కిపోయింది. "బావ చెల్లెలుభర్త, తనను మోసం చేయ తలపెట్టాడు. యీ వుద్దేశ్యం అనూరాధకుకూడా వుందా? అదికూడా తేల్చేసుకోవాలి" ఇల్లు సమీపించారు.

భోజనాలవద్ద యిద్దరూ చాలా 'సీరియస్'గా వున్నారు. అనూరాధ కిదేమీ అర్థం కాలేదు రామానందం నంజుతున్నాడు కలిపిన కూరనే మరలా కలిపాడు "కూర బాగుంది కావాలా" అని అనూరాధ మరి కొస్తవడ్డించింది కలిపిన అన్నంతోసహా పక్కకి నెట్టాడు మంచి నీళ్లు అన్నంలోపోసి కలిపి, తర్వాత అవి మజ్జిగకాదు మంచినీళ్ళని తెలిసికొని నొచ్చుకున్నాడు అనూరాధ రెప్పవాల్చకుండా చూస్తూంది

ఇక రామ్మూర్తి ఏమీ కలపకుండానే వట్టి అన్నం మాత్రమే తిన్నాడు కొంతవరకూ. తర్వాత మజ్జిగ పొయ్యమన్నాడు. "ఇదేమిటి" అన్నది అనూరాధ

అదంతా నీ కెందుకు పొయ్యమన్నాను పొయ్యిఅన్నాడు చిన్నబుచ్చుకుంది "ఈ మనిషి ఎన్నాళ్ళకూ నన్నర్థంచేసుకోలేడు" రామ్మూర్తి లేచి చెయ్యి కడుక్కున్నాడు. రామానందం ఖాళీకంచం మీద తన పేరు వ్రాస్తూ, తుడుపుతూ వున్నాడు యీ యిద్దరి వైఖరి అనూరాధను దహించేస్తూంది

* * *

"అమ్మాయ్ డబ్బు విషయంలో నీ అభిప్రాయ మేమిటి?"

"ఏమి టన్నయ్యా అభిప్రాయా అ కింగులో ఏముంది రేపే బ్యాంకీలో డబ్బు తీసుకో" అన్నది అమాయకంగా.

"అదేమిటే మరి అతనేమో "అంటూ అంతా చెప్పాడు రామానందం.

అనూరాధ కంపించిపోయింది. ఏమీ అర్థం కావడం లేదు

తన భర్త యింత మోసగాడా–త్వరగా లేచి రామ్మూర్తివద్ద కెళ్లింది.

"ఏమండీ"

.... . ...

"ఇదేమిటండీ?"

"నా యిష్టం"

భయపడింది అనూరాధ.

"మరి డబ్బు "

"ఛీ ఫో నా యిష్టం. నీకు నేను కావాలి అనుకుంటే డబ్బుమాట ఎత్తకు నీ అన్నయ్యే కావాలనుకుంటే నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి అంతే" వీధిలో కెళ్ళాడు విసురుగా

కన్నీళ్లతో వెనుకకు తిరిగింది అనూరాధ

"అంతా విన్నానమ్మా నీవేం చేస్తావు. అనవసరంగా పేచీపడకు అసలే ఒక రకం మనిషి"

"ఇంత మోసమా అన్నయ్యా."

"నీ పండంటి కాపురం పాడుచేసుకోకు. నేను మాత్రం ఏం కష్టపడ్డానా ఏమిటే యీ డబ్బుకోసం! మీ రిద్దరూ బాగుంటే అంతే చాలమ్మ యింకీ విషయం అతనితో ఎత్తకు వస్తా అనూ జాగ్రత్త. ఉద్రేకాలతో ఒక్క క్షణంలో చేసే పనులే జీవితాలమీద దాడిచేస్తాయ్ మనుష్యుల స్వభావాలనుబట్టి నడుచుకుంటూండాలి వెళ్తానమ్మా" అంటూ బయల్దేరాడు తల్లితోసహా శ్రావణమాసం విషయం ఎవరూ ఏమీ మాట్లాడనేలేదు.

"అన్నయ్యా"...గోడకు చేరబడింది అనూరాధ

* * *

మనస్థిమితం లేక శెలవు పొడిగించాడు రామానందం పనీపాటా లేకుండావుంటే మరీ ఆలోచన లెక్కువౌతున్నాయని శెలవు రద్దుచేసుకుని ఆఫీసు కెళ్తున్నాడు కాని పనిసరిగ్గా చేయలేకపోతున్నాడు. దేని మీదా మనస్సు పోవడంలేదు. ఇంట్లో ఎవరితోనూ మాట్లాడడం మానేశాడు. వేళకేదో తినడం, ఒంటరిగా తిరగడం. మళ్ళీ పజిల్సుకట్టాలనే లేదు. పూర్తిగా మానేశాడనే చెప్పాలి. అసలు వాటికోసమై ఆలోచించేంత మనస్థిమితం లేదు. స్నేహితుల కందరికీ దూరంగా ఉంటున్నాడు. వాళ్ళతో కలిస్తే గతమంతా తవ్వుతారు. మానే గాయాన్ని రేపినట్లవుతుంది. అందుకనే వాళ్ళకి దూరంగా ఉంటున్నాడు.

సాయంత్రం అయిదు గంటలకి పార్కు కెళ్ళాడు. ఎన్నాళ్ళో అయింది దాన్లో అడుగుపెట్టి

'రామానందం' అని పిలుపు వినబడింది.

అప్రయత్నంగా తిరిగి చూశాడు స్నేహితుల మురాతో కలియడం ఆనాటికి తప్పనిసరైంది.

"మరీ కనుపించటమే లేదేంరా?"

............ ...

"ఆ, మరిచాను. నీ డబ్బువిషయం ఏం తేల్లేదురా?"

"లేదు. ఇక రాదు."

"మంచి బావేరా. లైలాకాలాగున్నాడు!"

......

"అయితే మీ బావమీద ఓ కేస్ ఫైల్ చెయ్యలేకపోయావ్"

"ఎందుకు రా?"

"ఎందుకేమిటి డబ్బుకోసమైతేనూ"

. . ..

"ఒరేయ్ రామానందం నీ పొట్టి చవటవురా, నేనైతే మీ బావను మూడు చెరువుల నీళ్లు తాగించేవాడిని"

"మీ బావనైతే నేనూ తాగించేవాడిని ఒరేయ్, విష్ణూ నీవు 'లా' పాసై ఇంకా రెండేళ్ళైనా కాలేదు నీకిటువంటి వాటిల్లో అనుభవం చాలా తక్కువ అసలు లేదన్నా నీవు ఒప్పుకు తీరాలి" అని నెమ్మదిగా అన్నాడు రామానందం

"వచ్చినట్టు" అన్నది మరో కంఠం.

"అలాంటివాడికి యిలాంటి కేసు యిస్తే, తీరా అదికాస్తా పోతే ...."

"అది డెఫినిట్ అనుకో" నసిగింది యిందాకటి కంఠమే

"చెడ్డ పేరూ వస్తుంది. మన ప్రతివాది ఎవడో కాదు బావ — చెల్లెలి భర్త"

"అదంతా నాకు వదిలేయరా. అయితే యీ కేసు నేనెందుకు తీసుకుంటాను? పరాంకుశరావు గారితో మాట్లాడి వార్ని నీ తరఫున పని చేయిస్తాను వారికి గెలుస్తుందనే నమ్మకం లేకుంటే ఆకేసే తీసుకోరు" అని విశదీకరించాడు విష్ణు

"సరే నీ యిష్టం. రేపు కనబడతా" అంటూ లేచి వెళ్ళాడు రామానందం

* * *

ఏ వ్యాపారం చేస్తాడూ అని ఆలోచిస్తూ అందరి సలహాలూ సేకరిస్తూ యింకా ఏ నిర్ణయానికీ రాలేక సతమతమౌతున్న రామ్మూర్తి, రామానందం తనమీద కోర్టులో వ్యాజ్యం వేశాడని తెలియగానే అగ్గైపోయాడు. అగ్గైపోయి గర్జించలేదు కాని,

అర్జించేశ్వరుంటే భూమ్యాకాశాలు కొంతవరకు దగ్గరిల్లి వుండేవి. కాని, ఆ సాయంకాలం గనూరాధకు "యీ బ్రతుకు బ్రతికేకంటే చావడం మేలు" అనిపించింది

రామ్మూర్తి స్నేహితుల సలహాలతో బారిష్టరు కృష్ణారావుగార్ని వకీలుగా కుదుర్చుకున్నాడు. కృష్ణారావుగారు యీ కేసు తప్పకుండా గెలవాలని పట్టుబట్టి ఎన్నో పుస్తకాలు చదివేస్తున్నారు.

రామానందంవైపు బలమైన సాక్ష్యాలేమీ లేవు. తాను అనూరాధ పేరుతోనే పజిలు కట్టాడు. అంతా అనూరాధ పేరుమీదుగానే జరిగింది. యిందులో దేన్లోనూ తన ప్రసక్తే లేదు కాని పాత ఉత్తరాల కట్టలో ఒక పాతకార్డు, మాసుకొన్న ముచ్చటైన కార్డు, అతి విలువైనది, వెతకగా కనుపించింది మసిబొగ్గుల్లో మాణిక్యం—యీ ఉత్తరాన్ని చూచిన పరాంకుశరావుగారు సంతోషంతో పెద్దకేక వేశారు బంట్రోతుని. తత్క్షణమే వాడ్ని కాఫీ తెమ్మని నోటీసు జారీచేశాడు. ఇదివారు అతి సంతోషము కలిగినప్పుడు ఆచరించే ఆచారము. ఇలాంటి సన్నివేశము రోజుకు ఒక్కటైనా వుంటుంది.

ఇంత సంతోషానికీ మూలము ఆ పాత కార్డు అదే అనూరాధ వ్రాసినదే. దాన్లోని సగభాగం మీద యీ కేసు జయాపజయాలు ఆధారపడి వున్నాయి.

"సరే. ప్రైజంటూ వస్తే సగం భాగం ఏమిటే డబ్బంతా నీదేకదూ తప్పకుండా యిస్తాను."

నీ చెల్లెలు
అనూరాధ.

యీ భాగమే చాలా ముఖ్యమైంది. కాని రామానందానికిదేమీ సరిపడలేదు. తన చెల్లెలు వ్రాసిన ఉత్తరంమూలాన్నే తనా డబ్బు లాక్కోవాలా. యిక వేరే మార్గం లేదూ-వుండదు ఒక్కసారి ప్లీడరు పరాంకుశరావు వైపు తిరిగాడు సంతోషంతో ఆయన కాఫీ తాగేస్తున్నాడు. యింకేం మాట్లాడలేక పోయాడు

"వాది తన చెల్లెలు పేరుతో పజిలు కట్టాడు. ఆ పజిలులో లక్షా యాభై వేల రూపాయలు బహుమానం వచ్చింది. చట్ట ప్రకారం ఆడబ్బు అనూరాధదే కాని అనూరాధ తన అన్నయ్యకు బహుమానంలో సగం డబ్బు యిస్తానని ఉత్తరం వ్రాసింది. దాని ప్రకారం సగం పైకం రామానందానికి చెల్లవలసి వుంటుంది కాని అనూరాధ భర్త ఆ పైకం యిచ్చేందుకు సమ్మతించుట లేదు అసలు ఆ పజిలు కూడా రామానందం కట్టలేదంటాడు కాని, నిజాన్ని బైటపెట్టేందుకు ఒక్క అనూరాధ వ్రాసిన ఉత్తరంకంటె వేరే సాక్ష్యం అక్కర్లేదు కాబట్టి బహుమానం పైకంలో సగభాగం అనగా డెబ్బై అయిదు వేలు రామానందానికి చెందవలసినది"

యీ విధంగా జడ్జి తీర్పు చెప్పారు

కోర్టు వెలుపల చెట్టు క్రింద రామానందం, అనూరాధ, పెద్దన్నయ్య అందరూ నిలబడి వున్నారు.

రామమూర్తి కోర్టులోనుంచి విసురుగా వెలుపలికి వచ్చాడు.

"యిదిగో చెక్కుబుక్కు. యిక నీకూ, నాకూ సంబంధం లేదు" అని బుక్కును అనూరాధ ముఖంమీద కొట్టివెళ్లాడు అనూరాధ వణకిపోయింది. ముఖం పాలిపోయింది.

రామానందం, అనూరాధ జట్కాలో రామ్మూర్తి వద్ద కెళ్ళారు యింటి యజమాని వచ్చి రామ్మూర్తి యిల్లు ఖాళీచేసి వెళ్ళాడనీ, సామాన్లు అవీ మీరు వస్తే యివ్వమన్నారనీ చెప్పాడు రామ్మూర్తి స్నేహితులందర్ని అడిగినా, ఏ ఒక్కరూ సరైన సమాధానం చెప్పలేకపోయారు. రామ్మూర్తి పనిజేసే ఆఫీసుకెళ్లి విచారిస్తే ఉద్యోగానికి రాజీనామా నిచ్చి వెళ్లాడని తెలిసింది. చెల్లెలితో యింటి ముఖం పట్టాడు.

* * *

అనూరాధ కాపురం యీ విధంగా తయారైందని దిగులు, డబ్బుతో ఏం చెయ్యాలని ఆలోచన ఏమీ తోచకుండా వుంది రామానందంకు అన్నయ్య యిదేమీ పట్టించుకోకుండా ఆఫీసు, తనుగా వుంటున్నాడు

పెద్దల సలహాలపై 'రామానంద్ టెక్స్టైల్స్' అని ఒక పెద్ద బట్టలకొట్టు, 'అనూరాధటాకీస్' అని ఒక సినిమాహాలు యిద్దరు ఘరానా' వాళ్లను పిలిపించి ప్రారంభోత్సవం చేయించాడు కొద్ది రోజుల్లోనే లాభాలు బాగా వచ్చి వ్యాపారం పెద్దది చేశాడు. ఆంధ్రదేశంలోని పెద్ద నగరాల్లో బ్రాంచీలు కూడా పెట్టారు ఇక జిల్లాలో కల్లా పెద్దది, అన్ని వసతులు కలిగిన సినిమాహాలు అనూరాధటాకీస్ ఒక్కటే అయింది. సినిమాస్కోప్ అరేంజిమెంట్లు చేయించాడు. ఆమె పేరుతో ఒక చిత్రానికి కొంత పెట్టుబడి పెట్టాడు. ఆ చిత్రం ఆంధ్రలో శతదినోత్సవాలు జరుపుకున్నది.

హైస్కూలు భవనానికి విరాళము రెండువేలిచ్చాడు వరద బాధితులకూ, భూకంపాల బాధితులకూ, కరువు బాధితులకూ సహాయంచేయని దినమే లేదు కాలేజిలో ఫిజిక్సు లేబొరేటరీని నిర్మించేందుకయ్యే ఖర్చులో నాలుగోవంతు యిస్తానని వాగ్దానం చేశాడు ఆ మరు సంవత్సరమే కాలేజి కమిటీ మెంబరయ్యాడు. డబ్బూ, పలుకుబడీ బాగా సంపాయించాడు. ప్రతి శుక్రవారం పేదలకు అన్నదానం చేస్తాడు. అందువల్ల వాళ్లలోనూ రామానందం పేరు బాగా వినబడ్తోంది

ఆంధ్ర మంత్రివర్గం పడిపోయింది. మరల ఎన్నికలకు అభ్యర్థులను నియమిస్తున్నారు. రామానందం పేరు ఆ జాబితాలో కెక్కింది. పెద్ద నాయకుల ప్రోద్బలంవల్ల రామానందం పోటీచేయక తప్పలేదు. ఎక్కువ కష్టపడకుండానే, ప్రత్యర్థికి ధరావతు కూడా దక్కకుండానే గెలిచాడు.

అసెంబ్లీ మొదటి సమావేశానికి ఆంధ్ర రాజధాని కర్నూలుకు వెళ్ళాల్సొచ్చింది. అనూరాధకూడా అన్నయ్యతో బయల్దేరింది కర్నూలుకు

కర్నూలు గవర్నమెంటు హాస్పిటల్లో అసిస్టెంట్ సర్జన్‌గావున్న సుబ్బారావు, రామానందం స్నేహితుడు. పనితొందరలో తమ రాకను అతనికి తెలిపేందుకు వ్యవధి లేక పోయింది. స్టేషన్నుంచి నేరుగా హాస్పిటల్ కే వెళ్ళారు. డాక్టర్ సుబ్బారావు అప్పుడే ఒక ఆపరేషన్ పూరిజేసి విశ్రాంతి తీసుకుంటున్నాడు. బంట్రోతు ఒక చీటీ నిచ్చి వెళ్ళాడు.

డాక్టర్ సుబ్బారావు ఎదురువెళ్ళి యిద్దర్ని తీసుకొచ్చాడు.

"ఒక్క ఉత్తరం ముక్క వ్రాయలేక పోయావుటోయ్."

"పని తొందర్లో మరచానోయ్"

"అవున్లే! ఎలాగైనా యం యల్ ఏ. విక

(34 వ-పేజీ చూడండి)




# వరకట్న నిషేధచట్టము

ఇల్లిందల సరస్వతీదేవి

దానము చేసేటప్పుడు దక్షిణ సమర్పించటము హైందవాచారము. షోడశ మహాదానాలలో కన్యాదానము ఒకటి. కన్యాదానకాలములో, అన్ని విధముల యోగ్యుడని భావించిన బ్రహ్మచారికి వయసున చిన్నవాడయినప్పటికీ, కన్యాదాత కాళ్లుకడిగి ఆ నీళ్లు తలమీద చల్లుకొంటాడు. పరిగృహీత విష్ణుసమానుడని భావించటముచేత చిన్నవాళ్లకు కాళ్లు కడిగినందువల్ల దోషము లేదని నిర్ణయించబడ్డది. ఈ సందర్భములో దాత, తాంబూలములో దక్షిణపెట్టి సమర్పించటము ఆచారము.

దానాలలో కొన్ని పుణ్యాన్ని ప్రాప్తింపచేసేవి; కొన్ని పాపపరిహారార్థము చేసేవి. షోడశమహాదానాలు, దశవిధదానాలు మొదటిరకములో చేరినవి. నువ్వులు, గుమ్మడికాయ, మహిషము ఇనుము మొదలైనవి రెండవరకములో చేరినవి. ఈరకపు దానాలను పరిగ్రహించటము కష్టమైనపని. దానము పరిగ్రహించిన తరువాత కొంత జపతపాలతో గాని ఆపాపము పోదని హైందవ విశ్వాసము. కనుక ఈరకపు దానాలను పరిగ్రహింపచేయటానికి దక్షిణ ఎక్కువగా సమర్పించవలసి ఉంటుంది.

కన్యాదానము చేసేటప్పుడు శక్త్యనుసారము గోదానము భూదానము హిరణ్యదానముకూడా చేస్తూఉంటారు. ఈసందర్భములో సమర్పింపబడే దక్షిణవిషయములో ఏవిధమయిన నిర్ణయములేదు. కన్యాదాత యథాశక్తి సమర్పించేవాడు.

వాస్తవముగా కన్యాపరిగృహీతగా ఎన్నుకోబడటమే ఘనమైన విషయము. కన్యాదానముతో దక్షిణగా ఎంత స్వల్పమొత్తము లభించినా గొప్ప సంగతే. ప్రాచీన భారతములో అందరి భావాలు ఇచ్చిపుచ్చుకోవటాలలో పారమార్థిక చింతతోనే నిండిఉండేవి. కనుక దక్షిణ తీసుకొనేవారు ఎంచుకోవటముగాని, ఇచ్చేవారు నిర్ణయించటముగాని, ఇద్దరిమధ్య బేరాలు సాగటముగాని లేదు

కొంతకాలము క్రిందట ఈ ఆచారము లౌకికమయి, దానము తీసుకొనే వ్యక్తి 'దక్షిణ ఎంత, భూమి మంచి మాగాణి భూమేనా' అని పదిమందిని ఆలోచించి గాని అంగీకరించని పరిస్థితికి వచ్చింది. కొన్ని దశాబ్దాలనుండీ, ఇది మరింత హేయముగా, పదిమందిలోనూ ఆ దక్షిణను పళ్లెములో పోయించుకోవటము, రూపాయల నోట్ల కట్టలను ముందుగానే ఎంచుకోవటముగా పరిణమించింది. కొన్ని సందర్భాలలో ఎడ్వాన్సు తీసుకోవటము కూడా జరుగుతూ వచ్చింది. ఈ విధముగా వరదక్షిణ కొనుకై కట్నమై ఫీజుగా రూపొందింది; రానురాను వివాహాలలో కట్నము రాబట్టుకోవటమే ప్రధానలక్ష్యముగా మారిపోయింది. అందుచేతనే వివాదాంశమయింది.

ఈడూ జోడూ, కులమూ గోత్రమూ, వంశమర్యాదలు పరితూగిన సంబంధాలు వరకట్నాల దగ్గరే చెడిపోవటము జరుగుతున్నది. ఆడపిల్లలు పనీ పాటా నేర్చుకుంటే

(30-వ పేజీ చూడండి)



విశాఖపట్టణం హార్బరు దృశ్యాలు



ఫోటోలు : కనుమంకల రామారావు—విశాఖపట్టణము.

# ★ వరకట్న నిషేధ చట్టము ★

చదువుకోదని వంక పెట్టుతున్నారు. చదువుకొంటే సంగీతము రాదనీ, అదీ వచ్చి ఉంటే 'నాటక చేరీలు చేస్తారా' అనీ, నాగరీకముగా ఉంటే సంసారపక్షముగా లేరనీ, అధికముగా ఉంటే పల్లెటూరి పిల్లలనీ అభ్యంతరాలను విసరుతున్నారు.

ఇంతకూ కన్యకు విద్య ఎంతవరకు అవసరమో, సంగీతము ఎంతవరకో, రావలసిన పనిపాటలు ఏవకమో మొదలైనవాటికి ఒక సూత్రము గాని కొలబద్ద గాని లేదు. ఏ నియమాలకు గాని సూత్రాలకు గాని బద్ధులు కావాలన్న పట్టుదల ప్రజలలో లేదు. కనుకనే 'చదువుకొన్న పిల్లను తప్ప మావాడు మెచ్చడు' అన్న తలిదండ్రులు నానా కాలపు చదువులతోనే తృప్తి పడుతూ వచ్చారు. అందచందాలు తప్ప మరొకటి ప్రధానము కాదని కచ్చితముగా అన్నవారు 'కులమింటికోతి అయినా మాకె' అనుకొన్నారు. ఈ సర్దుబాట్లన్నిటికీ కారణము ఒకటే—దక్షిణ! ఈ దక్షిణ ఎంత గొప్పగా—మాట ఎంత బరువుగా వుంటే వరుని పక్షమువారి కంత నిదానము ఏర్పడుతుంది. మొత్తముమీద దక్షిణ అతిలౌకికమైపోయి, ఇతర మహాదానాలలో గొప్పదనిపించుకొన్న కన్యాదానానికీ, పాపపరిహారార్థముగా ఇచ్చే దానాలలో దక్షిణ అధికముగా ఉండవలెనన్న వరకట్న సంబంధము ఏర్పడ్డది.

సమాజములో పై తరగతివారికి పై తరగతిలోను, మధ్య తరగతి వారికి మధ్య తరగతిలోను వివాహ సంబంధాలు ఇష్టపడినట్లయితే వర కట్నాలు అధికమయినా, ఆ తరగతుల ననుసరించి తరతమ భేదాలతో వర్తిస్తాయనుకోవచ్చు. అట్లా కాకుండా, అన్ని తరగతులవారికీ పై తరగతులస్థాయిలో కట్నాలందుకోవాలనే కాంక్షలు కలగటముతో అలజడి బయలుదేరింది. ఈ కారణముచేత రెండు పక్షాలకూ 'తగిన' సంబంధాలకరవు ఏర్పడుతున్నది. ఈ కరవు నిజమైన అభావము కాదు. కన్యపక్షమువారికి సంబంధాలు అందుబాటులో లేకపోవటమూ, వరుని పక్షమువారి దృష్టికి ఆనకపోవటమూ లోని గుట్టు.

కన్యలకు వివాహాలు చేసే సంప్రదాయ సిద్ధాలైన ఆచారాలను పాటించదలచుకొన్నవారు వరులుకోరిన ధనరాసులను సమర్పించి కృతార్థులు కావలసినదే. ఈ ధన రాసులకొరకు ఆస్తులు హరించుకొని పోవటము సామాన్యవిషయముక్రింద లెక్కించబడ్డది.

కొన్ని సామాన్యకుటుంబాలలో ధనాభావముచేత కన్యల వివాహకాలము పొడిగించబడటము, కన్యలు ఆ ప్రభుత్వమువారి ఆదరముచేతగాని *పాఠశాలాధికారుల అభిమానముచేతగాని లభించిన ఉచితవిద్యార్థి వేతనాలతో ఉన్నత విద్య నభ్యసించటము జరుగుచున్నది. ఈ కన్యలకు సామాన్యకుటుంబాలలోని ఏ కొద్దిపాటి చదువులతోనో చిన్న ఉద్యోగాలు చేసే వరులు ఈడయినా జోడుకారు. విద్యాదృష్టితో సమాన ఉజ్జీగా కనిపించేవరులు, పెద్దకుటుంబాలలో పెరిగిన ఉన్నత విద్యావంతులూ పెద్ద ఉద్యోగస్థులూ అవుతారు. ఇక-ఈకన్యలకు 'తగిన' సంబంధాలు కలసి ఎట్లా వస్తాయి? కనుకనే చాలామంది కన్యలు వివాహాలు లేకుండా ఉండవలసినవారైనారు. వివాహాలు చేసితీరవలెనన్న పట్టుదల కలవారు పడుతున్న కట్నాలబాధను చూడలేని కన్యలు కొందరు ప్రాణత్యాగము చేశారు. అటువంటి కన్యలు కొందరు ఆంధ్రవాఙ్మయములో కావ్యనాయికలయినారు.

వరకట్న దురాచారాన్ని రూపుమాపవలెనని కొన్ని దశాబ్దాలనుండీ ఆందోళనబయలుదేరింది. దానిఫలితముగా ఆంధ్రశాసన సభలో అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఒకబిల్లు ప్రవేశపెట్టదలచగా ప్రభుత్వము (ఆంధ్ర) దాని ప్రతిపాదనకు అనుమతినిచ్చింది. ఈ బిల్లు ప్రకారము వివాహములో వరుడికి దక్షిణగా ఒక్క కానీ అయినా ఇవ్వటానికి వీలులేదు. కానుకల రూపములో మూడు వేలవరకూ ఇవ్వవచ్చు. ఈ చట్టము ప్రకారము కట్నము ఇవ్వటము పుచ్చుకోవటము నేరము క్రింద పరిగణింపబడుతుంది. దౌర్జన్యముచేత కట్నము ఇవ్వవలసి వచ్చినట్లయితే తిరిగి దానిని రాబట్టుకొనే అవకాశాలను ఈ చట్టము కల్పిస్తున్నది.

ఈ చట్టము కొంతవరకు వరకట్న దురాచారాన్ని అరికట్టటానికి ఉపయోగపడుతుందనటములో సందేహము లేదు.

కాని, ఈ కాలములో సాధారణముగా ఏ వరుడూ పళ్ళెములో కట్నము పోయించుకొని పదిమంది ఎదుట బాహాటముగా చదివించుకోవటము లేదు. వరుడి దాహము లాంఛనాల రూపములో తీర్చబడుతున్నది. కన్యాదాత ఇల్లు గుల్లయినా పేరుకు కట్నము యివ్వనట్లే లెక్క. 'మేము కట్నము ఒక్క కానీ అయినా యివ్వలేదండీ' అన్న కన్యాదాత, వివాహ కాలములో అల్లుడికి చదివించిన కానుకలపట్టీ కొన్ని వేలను మింగుతున్నది. 'మేము కట్నమేమీ తీసుకోలేదు. ఏదో వాళ్ళ సంతోషానికి మాత్రము లాంఛనాలు ఇచ్చారు' అన్న వారి లాంఛనాల జాబితా కొన్ని వేలను మించి ఉంటున్నది.

కచ్చితముగా నిర్ణయించుకొన్న కట్నము ఇచ్చినవారికీ తీసుకొన్నవారికీ తృప్తిని కలిగిస్తుంది. కాని లాంఛనాలు ఎన్ని వేలయినా కన్యాదాతలకు ఇచ్చిన పేరు ప్రతిష్ఠలు రావు. ఎంత తీసుకొన్నా ఒక కొలతబద్ద లేకపోవటముచేత, పరిగ్రహీతలను అవధు లెరుగని అసంతృప్తి పీడిస్తూనే ఉంటుంది. ఈ ఆచారము కుటుంబాలను 'తడిగుడ్డలతో గొంతుకోయటము'వలె ఉన్నది.

కాళేశ్వరరావుగారు ప్రతిపాదించబోయే బిల్లు ననుసరించి వరుడు బాహాటముగా మూడువేలవరకూ లాంఛనాలను తీసుకోవచ్చు. అన్ని విధాల తగిన సంబంధ మనుకొన్నప్పుడు రహస్యముగానైనా కన్యాదాత, వరుడికి దౌర్జన్యముతో కాకపోయినా బ్రతిమిలాడి అయినా ఇవ్వవలసినవాడవుతాడు. నిజానికి కన్యాదాత పరిస్థితి ఎప్పుడూ ఒకటిగానే ఉంటుంది; బాహ్య పరిస్థితులలో మాత్రమే మార్పులు కలుగుతాయి.

'కన్యతోపాటు కట్నము ఎంత' అని బాహాటముగా అడగకపోయినా మహమ్మదీయ కుటుంబాలలో 'అమ్మాయికి ఆస్తి ఎంత ఉన్నది?' అని అడగటము అలవాటు. మన కుటుంబాలలో 'పిల్లవాడికి ఆస్తి ఎంత ఉన్నది' అని మనము విచారించినట్లుగా వాళ్లు పిల్ల ఆస్తినిగురించి విచారిస్తారు. మహమ్మదీయులలో ఆస్తిగల పిల్లకే ఓటు (పెళ్ళికి) లభించటము ఉన్నది.

'ఈ కట్నాలబాధ స్త్రీలకు వారసత్వాధికారము లభించనిదే పోదు' అని కొందరు ఊహాగానాలు చేస్తున్నారు. కాని ఇంత కాలమునుండీ కట్నము ఎక్కువ లభించే సంబంధాన్ని అంగీకరించినట్లుగా, ఇక ముందు ఆస్తిగల కన్యనే నిశ్చయించుకొంటారు. కాని దానికీ దీనికీ ఒక తేడా కనబడుతుంది - కట్నముగా వచ్చిన మొత్తము తల్లిదండ్రులు ఖర్చుచేసుకోవచ్చు. దీనికి ఏ శాసనమూ అడ్డు రాదు. కాని పిల్లతో వచ్చిన ఆస్తిని వరుడి తలిదండ్రులు తాకటానికి వీలులేదు. వరుడికయినా అధికారము లేదు—బుజ్జగించి వ్రాయించుకుంటే తప్ప.

స్త్రీలకు వారసత్వాధికారము లభించినంత మాత్రాన వివాహాలలో ధనానికి ప్రాధాన్యత తగ్గిపోతుందనుకోవటము పొరపాటు. కాళేశ్వరరావుగారి బిల్లువల్లనూ అంతే. కాకపోతే చట్టరీత్యా నిషేధింపబడు తున్నదని ఒక సంతృప్తి.

# అంతరార్థాలు

## పంతుల కృష్ణారావు

అప్పుడే బజారునుంచి కూర తెచ్చి పడేసి, ఆదివారం ఆఫీసుకి శెలవు అవడం మూలాన ఏమీ తోచక గదిలో ఈజీచైరులో చేరబడి ఏదో తెలుగుపత్రిక చదువుతూన్న వెంకట్రావుకి, వంటింట్లో గిన్నెలు, చెంబులు బ్రద్దలవుతూన్నట్టు శబ్దం వినిపించింది. ఆ శబ్దం వెంబడే "అదేం మనిషో?-సమంగా కూరలు బేరం ఆడి కొనడం కూడా తెలీదు!" అన్న వాక్యం కూడా వినిపించింది. అప్పుడే ఏదో భూకంపం ఆరంభించే సూచనలు అగుపిస్తున్నాయనుకుంటూ వంటింట్లో కొచ్చి "ఏమిటే?" అని అడిగాడు వెంకట్రావు భార్యని.

"ఈ వంకాయలు వీశ ఎంతకి కొన్నారు?" అని అడిగింది భార్య రాజ్యం.

"ఏం?-వీశ పదణాలు!"

"అందరికీ అరణాల కివ్వగా మిమ్మల్ని చూడగానే పదణాలు చెప్పాలని బుద్ధిపుడుతుంది కామోసు ఆ దుకాణం వాడికి?"

రాజ్యానికి కోపం ముక్కుమీదుంటుంది మాటాడే టప్పుడు ముందూ వెనకా మానుకోకుండా ఎవరితో మాటాడుతున్నదీ ఏమయేదీ ఆలోచించకుండా మాటాడేస్తుంది

రాజ్యం మాటలు వెంకట్రావుకి కష్టాన్ని కలిగించాయి

"రాజ్యం!-తెలుసుకోకుండా మాటాడకు!-ఈ రకం వంకాయలు బజార్లో వీశ పదణాలకి తక్కువగా ఎవ్వడూ ఇవ్వలేదు!" అన్నాడు వెంకట్రావు శాంతంగానే.

"మరి చెప్పకండి!-బేరం ఆడడం చేతకాకపోతేసరి!-ఎదురింటి కృష్ణమూర్తిగారు ఇప్పుడే వీశ అరణాల చొప్పున కొనితెచ్చారుట. అవి డిప్పుడు నిప్పుకోసం వచ్చి చెప్పింది!"

"రాజ్యం, నేనంత తెలివిమాలిన వాడిని కాను! బజార్లో అందరూ పదణాలకి తీసుకుంటూండగా చూసి తీసుకున్నాను!" అని అన్నాడు.

"మరి కృష్ణమూర్తిగారు అరణాల కెలా తెచ్చారు?"

"అవి అఖరుకాయలై ఉండొచ్చు!-అన్నీ ఎంపుడైపోయాక చివరకి మిగిలిన కాయల్ని అలాగ చవగ్గానే ఇచ్చేస్తారు. కాని వాటివల్ల లాభంవుండదు. వీశకాయలు కొంటే అరవీశను కూడ పనికి వచ్చేవి వుండవు!" అని బోధపరచడానికి ప్రయత్నించాడు వెంకట్రావు.

కాని రాజ్యం ఊరుకోలేదు. "మరి చెప్పకండి!-మీకు బేరంచేసి కొనడం చేతకాదు అయన కొన్న వంకాయలు కూడా చూశాను. వీటికంటే అవే బాగున్నాయి!" అని అన్నది. ఎంత చెప్పినా వినకుండా రాజ్యం ఇంకా ఆ విషయాన్నే పట్టుకు వేళ్ళాడడంతో వెంకట్రావుకి విసుగు వేసింది.

"అవును నిజమే, నాకు బేరం ఆడడం చేతకాదు సరా?-ఇంక ఊరుకో!"

ఇంకా రాజ్యం ఊరుకోలేదు. "అదేం మనిషో? - మాటాడితే చిరాకు! - అంచేతే ఇలా వుంది సంసారం!" అంది. ఈ మాటలు వెంకట్రావుకి కష్టాన్ని కలిగించాయి

"ఎలా వుందేవిఁటి?-నీకేం లోటయింది?"

"ఊహుఁ!-ఏ లోటూ లేదు!-మహారాజభోగా లనుభవించేస్తున్నాను!" అంది మొహం ముడుచుకొని

"మహారాజ భోగాలు కావలసిన దానివి ఏ మహారాజునో పెళ్లి చేసుకోవలసింది!-ఈ గుమస్తా నెందుకు పెళ్ళాడేవు?"

"నిజమే!" అంది రాజ్యం. ఈ మాటతో వెంకట్రావుకి పట్టరాని కోపంవచ్చింది

"ఇప్పుడే నా మించిపోయిందిలేదు" అంటూ కోపంతో అక్కడినుంచీ వెళ్లిపోయాడు వెంకట్రావు.

---

వివాహములో దేనికి ప్రాధాన్యము నివ్వాలి? దీని సమాధానము ఆలోచించేవారి సంస్కారాన్ననుసరించినది. వివాహమువల్ల కేవలము భౌతిక సుఖాలనే కోరుతున్నామా — ఆత్మానందము కూడా కావాలనుకుంటున్నామా? కేవలము భౌతిక సుఖాలను మాత్రమే కోరుకొంటున్నాము కనుక వాటి ననుసరించినవాటికిమాత్రమే ప్రాధాన్యత నిస్తున్నాము.

'భార్య భర్తకు సహధర్మచారిణి — అర్ధాంగి. ఆమె సహాయ సహకారములతో ఇహ పరలోకాలను సాధించాలి' అన్న దృక్పథముతో పురుషుడు కోరతగిన వధువు

అనుకూలామ్ విమలాంగీమ్
కులజామ్ కుశలామ్ సుశీలసంపన్నామ్
పంచలకారామ్ భార్యామ్
పురుషః పుణ్యోదయాల్లభతే. ★

★ అంతర్థాలు ★

భర్త అలాగ వెళ్ళిపోయిన తర్వాత కాని తన మాటలతన్ని బాధించినట్టు గుర్తించలేదు రాజ్యం తన మాటల్ని అతనంత సీరియస్‌గా తీసుకుంటాడని ఊహించలేదు రాజ్యం. ఈ కూరవిషయంలో కూడ అనవసరంగా అతనితో వాదన పెట్టుకోలేదు అసలు ఆమెకి అన్ని వస్తువులూ సమంగా బేరంచేసి కొనుక్కొని డబ్బు పొదుపు చేదామన్న ఉద్దేశం లేనేలేదు ఆమెకు తన భర్త కూడా కృష్ణమూర్తిలాంటి బేరగాడు అవడమే కావలసింది. రాజ్యానికి ఈ పట్టుదల కలగడానికి కూడా కారణం వుంది

రోజూ ఉదయం ఎనిమిది గంటలకి నిప్పు తీసుకెళ్ళడానికి కామేశ్వరమ్మ వెంకట్రావు గారింటికి రావడం, ఆ సమయానికే రాజ్యం భర్త బజారు నుంచీ తెచ్చిన కూరలు తరుగుతూ వుండడం, కామేశ్వరమ్మ వాటి ధర రాజ్యాన్ని కనుక్కొని తన భర్త అవే కూరల్ని అంతకంటే తక్కువ ధరకే కొన్నట్టు చెప్పడం జరుగుతోంది. ఇలాగ రోజూ కామేశ్వరమ్మవచ్చి తన భర్తకే అన్ని వస్తువుల ధరలూ తెలిసినట్టూ వెంకట్రావుకి ఏ వస్తువులూ సమంగా బేరం చేసి కొనడం చేతకానట్టూ మాటాడడం రాజ్యం సహించలేకపోయింది రోజూవచ్చి వెంకట్రావుకంటే తన భర్త చవగ్గా బజారు సామాన్లు తెచ్చాడని గొప్పగా చెప్పడం, తన భర్తని వట్టి తెలివితక్కువ వానినిగా కట్టడమేనని ఎంతో బాధపడింది రాజ్యం. కామేశ్వరమ్మమాటలు రాజ్యానికి కామేశ్వరమ్మపైనా, ఆమె భర్తలాగ అన్ని వస్తువులు సమంగా బేరంచేసి చవగ్గాకొని తేలేకపోతున్న తన భర్తపైనా అపరిమితమైన ఆగ్రహాన్ని కలిగించాయి అంగుకురించే రాజ్యం, ఎలాగేనా భర్తచేత కృష్ణమూర్తిగారిలా అన్ని వస్తువులూ చవగ్గా కొనిపించి కామేశ్వరమ్మ గర్వాన్ని అణచాలని నిశ్చయించుకుంది. దానికోసమే భర్తతో తీవ్రంగా వాదించింది. కాని అది మరో విధంగా పరిణమించింది.

రాజ్యం మామూలుగానే వంట పూర్తి చేసి, భర్త రాక కెదురుచూస్తూ కూర్చుంది పదకొండు గంటలయింది పన్నెండు కూడా అయింది వెంకట్రావు ఇంటికి రాలేదు రాజ్యానికి ఆత్రుత, భయము కలుగసాగాయి మనసు పరిపరివిధాల పోతోంది అలాగే ఎదురుచూస్తూ కూర్చుంది పన్నెండున్నరకి వెంకట్రావు ఇంటికి వచ్చాడు

రాజ్యం వంటింట్లో వడ్డించివచ్చి, "భోజనానికి రండి!" అని పిల్చింది భర్తని.

"అవసరం లేదు హోటల్లో భోంచేశాను!"

"అదేమిటండీ!" ఉబికివస్తున్న దుఃఖాన్నాపుకుంటూ అన్నది రాజ్యం

"ఏమీ లేదు నువ్వింక అవతలకి వెళ్ళు. నేను పడుకోవాలి!" అన్నాడు వెంకట్రావు.

"నన్ను క్షమించండి!"

"క్షమించక్కర్లేదు నువ్వింక కిక్కజ్జించి పోతావా? లేక నన్నే పొమ్మన్నావా?" కోపంతో బిగ్గరగా అన్నాడు వెంకట్రావు.

రాజ్యం హడలిపోయింది. భర్త చాలా కోపంమీదున్నాడు ఇప్పుడతనితో ఏం మాటలాడినా లాభంలేదు తనే అతనితో ఇల్లా అవుతుందని తెలియక వాదించింది. ఇప్పుడా ఫలితాన్ని అనుభవిస్తోంది ఆ మధ్యాహ్నం రాజ్యం భోజనం చేయలేదు.

వెంకట్రావు మూడున్నరకి లేచి మొహం కడుక్కొని బట్టలు వేసుకొని బయల్దేరబోతుండగా రాజ్యం కాఫీ తీసుకొచ్చింది. వెంకట్రావామె వంక కూడా చూడకుండా వీధిలోకి వెళిపోయాడు భర్త వెళ్లిపోయాక రాజ్యం మంచంమీద పడుకొని భోరున ఏడ్చింది

ఆ రాత్రికూడా వెంకట్రావు ఇంట్లో భోజనం చేయలేదు హోటల్లో భోంచేసి వచ్చి భార్యవంకేనా చూడకుండా పడుకున్నాడు రాజ్యం కూడా భోజనం చేయకుండానే ఏడుస్తూ పడుకుంది.

ఆ మర్నాడు కూడా ఉదయం ఏడున్నరకే స్నానం అది ముగించుకొని కాఫీతీసుకొండని రాజ్యం అన్న మాటనుకూడా వినిపించుకోకుండా కోపంతో వెళ్ళిపోయాడు వెంకట్రావు. రాజ్యం బాధగా విచారిస్తూ పడుకుంది.

ఎనిమిది గంటలకి కామేశ్వరమ్మ నిప్పుకోసం వచ్చింది. రాజ్యం పడుకొనుంది.

"ఏం అలా పడుక్కున్నావ్?" అని అడిగింది కామేశ్వరమ్మ.

"ఏమీ లేదు!" అని జవాబిచ్చింది రాజ్యం లేచివెళ్లి కామేశ్వరమ్మవద్ద గరిటె తీసుకుంటూ

"ఏం, ఇంకా బజారునుంచీ కూర తేలేదేమిటి మీ ఆయన? తీరుబాటుగా ఇలా పడుక్కున్నావ్?" అంది కామేశ్వరమ్మ.

"తేలేదు!" అని మూడక్షరాల్లోనే జవాబిచ్చింది రాజ్యం కామేశ్వరమ్మతో మాటాడడం రాజ్యానికిష్టం లేకపోయింది

"ఇవాళ బజార్లోకి మంచి బెండకాయలొచ్చాయట ఆయన తెచ్చారు వంద ఆరణాలట చాలా బాగున్నాయి!" అన్నది కామేశ్వరమ్మ.

"ఊహూం!" అంది రాజ్యం మళ్ళీ మంచంమీద పడుక్కుంటూ రాజ్యం జవాబులతీరు, తనతో మాటాడడం యిష్టం లేనట్టుగా ఉన్న ఆమె వైఖరి చూచి

కోపంతో మొహం ముడుచుకొని వెళ్ళిపోయింది కామేశ్వరమ్మ.

కామేశ్వరమ్మ వెళ్లిపోయాక లేచి వంట ప్రారంభించింది రాజ్యం భర్త యెలాగా భోజనానికి రాడని తెలుసును తను అసలు భోజనం చేయదల్చుకోనేలేదు అయినా ఆమె వంటకి ఉపక్రమించింది భర్త భోజనానికి ఇంటికిరాకుండా ఉండగలిగినా తనుమాత్రం అతనికోసం వండి, అతనిరాకకి ఎదురుచూడకుండా ఉండలేదు

ఆ మధ్యాహ్నం కూడా వెంకట్రావింటికి భోజనానికి రాలేదు. రాజ్యం విచారంతో పడుకుంది.

మధ్యాహ్నం రెండుగంటలకి పొరుగునున్న జానికమ్మ, సుందరమ్మ పనికట్టుకొని వచ్చి, "మీఆయన ఇవాళ మధ్యాహ్నం హోటల్లో భోంచేస్తున్నాడట ఏమిటి సంగతి ?" అని పరామర్శించారు

"ఆఫీసులో చాలా అర్జంటు వర్కుందట అంచేత ఇంటికి రావడాని కవకాశంలేక హోటల్లో భోంచేస్తున్నారు నిన్నను ఆదివారం శెలవైనాకూడా అర్జంటు పనుందని వెళ్లిపోయారు నిన్నసుకూడా భోజనానికి ఇంటికిరాలేదు!" అన్నది రాజ్యం. వచ్చిన ఇద్దరు స్త్రీలు రహస్యంగా ఒకరినొకరు గిల్లుకొని కళ్ళసైగలు చేసుకొని ఏదో కొంతసేపు మాటాడి వెళ్ళిపోయారు ఇంట్లో భర్త భోజనంచేయనివార ఇరుగుపొరుగులకు కూడా ప్రాకినందుకు విచారించింది రాజ్యం

మధ్యాహ్నం మూడుగంటలకి కామేశ్వరమ్మగారి ఆరేళ్ళ కూతురు పాపవచ్చి "మా దమ్మమ్మెమోనీ దీనితో పంచదా రిమ్మంరండీ!" అంటూ గిన్నెపట్టుకొచ్చింది ఆ పిల్లని చూడగానే రాజ్యానికేదో ఆలోచన తట్టింది.

పంచదార ఇస్తూ, "మీ ఇంట్లో ఇవాళ ఏం కూర వండుకున్నారు పాపా ?" అని అడిగింది

"మా నాన్నగారు బెండకాయలు తెచ్చారు అందులో చాలా కాయలు కుళ్లిపోయాయి. మా అమ్మకి మా నాన్నగారి మీద చాలా కోపం వచ్చింది కొంచెం మంచికాయ లుంటే అవి కూడా వండకుండా పెరట్లో పెంటమీద పారేసింది" అని చెప్పింది పాప రాజ్యం చాలా ఆశ్చర్యపోయింది

"అయితే మీ ఇంట్లో ఇవాళ మధ్యాహ్నం కూర వండుకోలేదూ ?" అని ఆశ్చర్యంగా అడిగింది రాజ్యం

ఊహూఁ!-మా నాన్నగారెప్పుడూ ఇంతే!-మంచి కూరలు తేరు!-అంచేతే మా అమ్మ రోజూ మా నాన్నగారితో దెబ్బలాడుతూ వుంటుంది!"

పాప చెప్పిన మాటలు రాజ్యానికి అపరిమితమైన ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించాయి అసలుగుట్టు రాజ్యానికిప్పుడు తెలిసింది తన భర్త బజారు పనులు చేతకానివాడని భావించి అతనితో అనవసరంగా వాదించి అతని మనస్సును నొప్పించినందుకు ఎంతో విచారించింది.

పాపవల్ల అసలు విషయాన్ని తెలుసుకున్న తర్వాత రాజ్యం బాధ చాలవరకు మాయమైంది. ఏదో మనస్సులో నిశ్చయించుకొని ఆనందంతో లేచి వెళ్లి కుంపటి రాజేసింది.

సాయంకాలం అయిదుగున్నరకి వెంకట్రావింటికి వచ్చాడు రాజ్యం పువ్వులవాయిల్ చీర కట్టి గులాబీరంగు సిల్కుజాకెట్టు తొడుక్కొని, తలలో సంపెంగపువ్వులు ముడుచుకొని, నీటుగా ముస్తాబై భర్త కెదురుగా వెళ్లింది. కాని వెంకట్రావు మొహం మరోవంకకు త్రిప్పుకొని దరదరా తన గదిలోనికి వెళ్లిపోయాడు రాజ్యం విపరీతమైన బాధ పొందింది. కళ్లంట నీళ్లు తిరిగినయ్ భర్త వెనకాలే ఆమె కూడా గదిలోకి వెళ్లింది వెంకట్రావు డ్రస్సు మార్చుకుంటున్నాడు రాజ్యం వెళ్లి ప్రక్కన నిల్చుని, "ఏమండీ!" అని మెల్లగా పిల్చింది. వెంకట్రావు పలుకలేదు మొహం కడుక్కోడానికని పెరట్లోకి వెళ్లిపోయాడు. రాజ్యం అడ్డుగా నిలబడింది

"ఆగండి!-ఇంకా నా మీద కోపమేనా?"అని అడిగిందిఅశ్రువులు రాలుస్తూ

"కోపం ఎందుకు?" అన్నాడు వెంకట్రావు కఠినంగా

"మరి ఇంటికి భోజనానిక్కూడా రాకుండా హోటల్లోనే భోంచేస్తున్నారు. నాతో మాటాడ్డమే మానేశారు. నేను కన్పించడమే ఇష్టంలేనట్టుగా నన్ను చూడగానే వెళ్లిపోతున్నారు...నే నన్న మాటల్ని క్షమించండి!. ఆ మాటల్ని నేను మరోభావంతో అన్లేదు రోజూ కామేశ్వరమ్మ వచ్చి తనభర్త అన్ని వస్తువులూ మీకంటె చవగా తెస్తాడని, మీకు వస్తువుల బేరం తెలీదని అంటూ ఉంటే నాకు చాలాబాధగా వుండేది. ఆమె మాటలు నిజమే ననుకున్నాను కృష్ణమూర్తిగారు బాగా వస్తువుల నాణెం, ధరా తెలిసిన మనిషని భావించాను అతనిలాగ మీరు కూడా చవగ్గా వస్తువులుకొని తీసుకురావడమే తనభర్త మంచిబేరగాడన్న కామేశ్వరమ్మ గర్వం అణగడానికి మార్గం అని ఆలోచించాను అందుగురించే నిన్నను మీతో అంతగా వాదించాను కాని ఇవాళ నాకు నిజం తెలిసింది కృష్ణమూర్తిగారికి ఓరవ్వంత కూడా వస్తువుల నాణెం, ధరా తెలియవు. ఆయన రోజూ కుళ్ళిపోయిన కూరలే తెస్తూ వుంటాడట!-కామేశ్వరమ్మ రోజూ అతనితో దీని గురించి దెబ్బలాడుతూ వుంటుందట కాని అందరితోను చెప్పడం తన భర్తకి

## అంతరార్థాలు

వస్తువుల నాణెం, ఖరీదు బాగా తెలుసునని చెప్పుకుంటూ వుంటుంది. నాకిదంతా ఇవాళ వాళ్ళ పాపవడగా చెప్పింది కాని నేనీ నిజాన్ని తెలుసుకోకుండా మిమ్మల్ని నేకమైన మాటలని నొప్పించాను. నన్ను క్షమించండి!" అని అన్నది రాజ్యం.

వెంకట్రావు కిప్పుడంతా అర్థమైంది ఆమె అమాయకత్వానికి చాలా జాలికలిగింది. ఆమె అట్లా మాట్లాడ్డంలో గల అంతరార్థాన్ని గ్రహించకుండా ఆమెనిట్లా బాధించినందుకు చాలా పశ్చాత్తాపపడ్డాడు.

ఇంకా అలాగే ఏమీ జవాబు చెప్పకుండా నిల్చున్న భర్త కళ్లలోకి చూస్తూ "ఇంకా నాతో మాటాడరూ?" అనిజాలిగా ప్రశ్నించింది రాజ్యం.

వెంకట్రావింకా ఊరుకోలేక పోయాడు. "పిచ్చిపిల్లా ఈ పాటిదానికి అప్పుడే కన్నీళ్లేనా?" అని మృదువుగా పలికాడు

"మరి నేను వండుతే భోంచేయకుండా పోతున్నారూ!" అంది రాజ్యం గోముగా.

"పోనీ నిన్నను, ఇవాళ భోంచేయనిదంతా ఈ రాత్రి భోంచేస్తాన్లే!" అని అన్నాడు వెంకట్రావు నవ్వుతూ.

"అందుకే మీకోసం చాలా చేసివుంచాను!" అన్నది రాజ్యం ఆనందంతో

"అయితే వుండు మొహం కడుక్కుని వస్తాను!" అన్నాడు వెంకట్రావు

వెంకట్రావు మొహం, కాళ్ళూ, చేతులూ కడుక్కొని వచ్చేసరికి రాజ్యం ప్లేటులో బజ్జీలు, కాఫీ పట్టుకునివచ్చి హాజరైంది భర్త ఫలహారం చేస్తుంటే రాజ్యానికెంతో ఆనందం కలిగింది.

సాయంత్రం ఆరుగంటలకి "రాత్రికి కూర తీసుకురావాలండీ!" అన్నది రాజ్యం.

"ఏదీ, సంచీ ఇయ్యి!" అన్నాడు వెంకట్రావు.

"సంచీ ఇస్తానుకాని చాలా చవగ్గా కొనితేవాలి సుమండీ!" అంది రాజ్యంనవ్వుతూ.

"అలాగేనండి" అని నవ్వుతూ వెళ్ళాడు వెంకట్రావు బజారుకి.

వెంకట్రావు బజారు నుంచీ బంగాళా దుంపలు తెచ్చాడు

"ఎంతండీ రాజాగారూ ఈ కూర ధర?" అని అడిగింది రాజ్యం నవ్వుతూ.

"వీశ పదణాలు ఓహో! - మరిచాను. రాణీగారికి ధర చెప్పేటప్పుడు కొన్నదరకి నాలుగణాలు తగ్గించి చెప్పాలికదూ?... కాదుకాదు.. వీశ ఆరణాలండి!" అన్నాడు నవ్వుతూ వెంకట్రావు

"అయితే నేను కూడా మరో నాలుగణాలు తగ్గించి కామేశ్వరమ్మవచ్చి అడిగేటప్పుడు వీశ రెండాలే అని చెప్తాను!" అన్నది పకపకనవ్వుతూ రాజ్యం. ★

## ★ సంపదతెచ్చిన సంతాపం ★

(26-వ పేజీ తరువాయి)

సన్మానాలూ, సభలూ, ఊరేగింపులూ..."

రామానందం నవ్వాడు. డాక్టరూ బిగ్గరగా నవ్వాడు. అనూరాధా అనుసరించింది.

బంట్రోతుని హోటలు కెళ్ళి కాఫీ పట్రమన్నాడు డాక్టరు. ఇంతలో ఒకనర్సు పరుగెత్తుకు వచ్చింది "డాక్టర్! 'ట్వంటీ సిక్స్' బెడ్‌లో పేషెంటు నానా హంగామా చేస్తున్నాడు. యీరోజే 'డిస్చార్జి' కావాలంటున్నాడు అలా 'డిస్చార్జి' చేయకపోతే మనల్ని తర్వాతైనా ఖూనీ చేస్తాడట. నాకు భయంగా వుంది డాక్టర్."

"ఎవరైనా కాపలావుంచి వచ్చావ్?"

"ఆ"

"సరే వస్తాను. నీవు వెళ్ళి అక్కడే వుండు"

"ఎవరు సుబ్బారావ్ ఆ పేషెంటు?" అని అడిగాడు రామానందం

"ఆ ఎవరో బైరాగి జీవితంలో అన్నీ పోగొట్టుకున్నాడిలా వున్నాడు. న్యూమోనియా జ్వరంలో వళ్ళు తెలియని పరిస్థితుల్లో యిక్కడికి ఎవరో తీసుకువచ్చారు జ్వరంలో ఏమేమో మాట్లాడేవాడు. చాలా విచిత్రమైన మనిషి వళ్ళు తెలిసినతర్వాత మందుత్రాగేందుకుఎంతోగొడవచేసేవాడు"

"ఇప్పుడెలావుంది డాక్టర్" అంది అనూరాధ ఆత్రంతో.

"జ్వరం తగ్గిపోయింది కొంచెం బలహీనంగా వున్నాడు. మూడు రోజుల్లో డిస్చార్జి చేస్తాము.

"ఎవరో వింత మనిషి లాగున్నాడే మేమూ చూడవచ్చా," అడిగింది అనూరాధ ఖాళీ కప్పు క్రింద పెడుతూ.

"ఆహా" అంటూ లేచాడు డాక్టరు. అందరూ లేచారు. ఇరవై ఆరో నెంబరు బెడ్‌మీద పేషెంటు ఆరోజు పేపరుపెద్దగా చదువుకున్నాడు గడ్డం పెరిగుంది జుట్టు నూనెలేక ఎర్రగా ముఖంమీదికి పడుతున్నాది కళ్లు లోతుకుపోయి, ముఖం పాలిపోయి ఉంది. అతన్ని చూడగానే రామానందం, అనూరాధ ఏదో 'షాక్' తిన్నట్టు 'ఫీల' య్యారు.

"పేరేమిటి డాక్టర్ గారూ?" మెల్లిగా అడిగింది అనూరాధ.

"రామ్మూర్తి అనిజ్ఞాపకం" గొణిగాడు డాక్టర్.

"ఆ." అంటూ నేరుగా పరుగెత్తుకెళ్ళి పేషెంటు పాదాలు తాకింది.

"ఏమిటి డాక్టర్" అంటూ పేపరు తీశాడు పేషెంటు.

"బావా" అంటూ దగ్గరకెళ్ళాడు రామానందం.

"హు. ఈ జీవితంలో మిమ్మల్ని చూడగూడదనుకున్నాను. కాని ఇప్పుడు చూడవలసి వచ్చింది. నీ చెల్లెలు మొగుడు ఆనాడు కోర్టులోనే చచ్చిపోయాడోయ్. అనూరాధా! ఆ పుస్తెలు తెంపెయ్-బొట్టు చెరిచేసి, గాజులు పగల కొట్టెయ్."

అనూరాధ బిగ్గరగా యేడ్చి కాళ్ళపై బడింది

"ఇప్పుడు నీ కే లోపమూ రాదు బావా. అనూరాధ పేరుతో కావలసినంత ఆస్తి ఉంది నీవూవుంటే ఇద్దరంకలసి యెంతో వృద్ధిచేసుకోవచ్చు చూడూ! చెల్లి యెంత చిక్కిపోయిందో" అన్నాడు రామానందం ప్రాధేయపడ్తూ.

"నాకేమీ అక్ఖర్లేదు మీరు వెళ్ళండి. నన్ను పోనీండి డాక్టర్"

"సరే. అనూరాధ ఆడదై పుట్టింది దానికి భర్తే సర్వస్వమూను మీరిద్దరూ యెక్కడైనా ఉండండి నెలనెలా మీకు కావలసిన పైకం పంపుతూంటాను."

"నీ మోచేతిక్రింద నీళ్లు త్రాగాల్సిన ఖర్మ నాకేంపట్టలేదు కష్టపడి సంపాయించి నా భార్యను పోషించుకొనే తాహతు నాకు లేకపోలేదు"

"సరే అవసరార్థం కొంతైనా యిస్తాను. దయచేసి తీసుకెళ్ళండి. ఒక్కక్షణం ఉండండి" అంటూ రామానందం డాకరు విశ్రాంతిరూములో ఉండే తన పెట్టెవద్దకు పరుగెత్తాడు.

"అనూ మీ అన్నయ్యవద్దనుంచి ఒక్క కానీ తెస్తే నీకూ నాకూ సంబంధం తెగిపోయిందన్నమాటే నేను కావాలంటే యెలా ఉన్నదానివి అలానే బయలుదేరు"

"సరే" అంది అనూరాధ.

రామ్మూర్తి అనూరాధ చెయ్యిబట్టి లాక్కెళ్ళుతున్నాడు. డాక్టరు అడ్డు చెప్పలేకపోయాడు. రామానందం నోట్లకట్టలతో పరుగెత్తాడు వాళ్ళవనకాలే పరుగెత్తబోయాడు కాని డాక్టరు అతన్ని నిలిపేశాడు. హాస్పిటలు ఆవరణ దాటారు. పోస్టుమార్టెం రూముగూడా దాటి ఇంకా వెళ్తున్నారు.

చీకటి పులుముకొంటూంది. మేఘాలు గాఢంగా అవరింమకొంటున్నాయి చిన్న చినుకులు పడుతున్నాయి. పెనుగాలి వీస్తూంది. చెట్లనుంచి ఎండిన ఆకులు గలగల రాల్తున్నయ్ దూరాన రైలుకూత వినిపించింది. రామానందం చేతిలో నోట్లకట్టలతో అలాగే నిలబడి ఉన్నాడు అలా ఎంతసేపు నిలబడ్డాడో.... డాక్టరు డ్యూటీ పూర్తి చేసుకుని వచ్చేటప్పటికి రామానందం గొణుగుతున్నాడు "పజిలూ-రామ్మూర్తీ" అని. ★




# తిరుపతి కొండ

**మధురాంతకం రాజారాం**

పాలసంద్రములోన పాప పానుపులా
రైలునందుండగనె కనుపించు నీకు
తులలేని అందాల తిరుపతి కొండ
తెలుగమ్మ మెడలోన మల్లెపూదండ!

ఏడు శిరసుల నాగు పడగెత్తినట్లు
బండి దిగుచుండగనె కనుపించు నీకు
గగనమ్ము నందుకొను గాలిగోపురము
గోవిందరాజుల కచట కాపురము!

పరుగెత్తు గోధుమవన్నె సర్పములా
ఊరు దాటంగానె కనుపించు నీకు
కొండచెంతకు నిన్ను కొనిపోవు దారి
ఎండలో వెండిలా మెరయు రహదారి!

అందుకోవలసిన ఆదర్శమట్లు
అటనుండి జూచిన కనుపించు నీకు
లీలగా 'అలిపిరి' గాలిగోపురము
బాలరో! శ్రమపడి ఎక్కాలి మనము!

జామ మామిడి వెలగ సీతాఫలము చెట్లు
చెట్లలో పెనవైచుకొన్న పొదరిళ్ళు,
కొల్లలమ్మా చెల్లి ఈ కొండపైన
గల్లుగల్లని పారుచుండు సెలయేళ్ళు.

కొండకొమ్మును జూడ తల యెత్తబోకు
కొప్పులో పువ్వులు క్రింద రాలేను!
ఆ లోయ పేరు 'అవ్వాసేరు కోన'
అటు చూడబోకమ్మ కళ్లు తిరిగేను!

భక్తితో కొలిచిన కరుణించి మనకు
వరమిచ్చు వడ్డికాసుల వేల్పు వీడు!
ఈరేడు లోకాల పాలించువాడు
ఏడు కొండలపైన వెలసియున్నాడు.

"శ్రీనివాసప్రభో! నీకు జోహారు!
శ్రీ వేంకటేశ్వరా! నీకు జేజేలు"
అని చేతులను మోడ్చి మ్రొక్కవే చెల్లి!
శుభము లొదవును నీకు నా చిట్టితల్లి!




# నదులు, సముద్రుడు

సమస్తలోకపు నదీ నదమ్ములు
సముద్ర తటమున నొకచోటన్
సమావేశమై ఒకేమాటగా
సముద్రు నిట్టులు నిందించెన్:

"ఘనాఘనమ్ముల పయోధారలన్
జనించి గిరులన్ భ్రమింతుము,
జనాళికోసము జగాన నెల్లెడ
అనారతముగా చరింతుము.

నిదాఘవేళల విదాహులెల్లరు
ముదాన మా జలమానుదురు;
నదీజలమ్ములు సుధాసమములని
సదా నుతింతురు మానవులు.

నిరంతరముగా విశుద్ధజలములు
పరిగ్రహింతువు మానుండి,
పరిగ్రహించిన క్షణాన వానిని
అరుచ్యములుగా చేయుదువు.

వనుల్ దాటుకొని, గిరుల్ దాటుకొని,
నినుంజేర పరతెంచెదమే!
వినిర్మలోదకములన్ కషాయము
లొనర్చుటేనా నీ న్యాయం?"

ఇదంతయున్ విని సముద్రుడప్పుడు
నదీనదమ్ముల కిట్లనియెన్.
"మదీయజలములు పరిగ్రహించియె
గదా, మేఘములు మీకిచ్చున్?

జలాల మలినము లొనర్తునంచును
ప్రలాపింతురే నదులారా!
బలా! బలా! మిము ననున్ జేరుడని
బలాత్కార మొనరించితినా?

సుధామధురములు భవత్తోయములు
యథార్థముగ మలినమ్మగునో,
యథేచ్ఛనిపుడే తిరోగమించుడు
వృథావివాదము లెందులకో?"

జవాబు విని, మరి సవాలువిని, ఆ
స్రవంతు లెంతయు లజ్జించెన్.
ప్రవాహనైజము అవార్యమగుటన్
ప్రవేశించెనవి సాగరమున్.

ఈసప్ కథలు: 22 — నండూరి రామమోహనరావు



నిజముగ మన హితముగోరు
సుజనుల నిర్హేతుకముగ
నిందించెడి మందమతుల
మందలించు నీ గీతము.

బాలసాహిత్య సీరియల్

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

## 7

ఒడ్డు చేరగానే బార్నీ మొదటగా, పిస్తోలు, కత్తి సురక్షితంగా ఉన్నాయో లేవో చూసుకున్నాడు. నీళ్ళలో బాగా తడిసిపోయిన పిస్తోలు అప్పటికి కొరగాకపోయినా, ‘ముందు ముందు ఎప్పుడైనా తుపాకి మందు దొరికితే, ఉపయోగిస్తుంది.’ అని బార్నీ భావించాడు. అదృష్టవశాత్తు చలివెయ్యడంలేదు; వెచ్చటి గాలి వీస్తోంది. అందుచేత ఇద్దరూ బట్టలు విప్పి పిండివేసి, ఆరబెట్టుకున్నారు. కాని కొన్ని నిమిషాలలో, పెద్దపెద్ద సముద్రపుదోమలు వచ్చి హింసించసాగాయి. వాటి కాట్లకు తాళలేక, బట్టలు ఇంకా ఆరకపోయినా వాటినే గబగబ తొడుక్కున్నారు.

మబ్బులు విచ్చిపోయాయి. దక్షిణాకాశంలో తారలు మెరిశాయి. తారలకాంతిలో తీర భూభాగం లీలగా గోచరించింది. ఒక పావుమైలువరకూ సముద్రపుటొడ్డు విస్తరించివుంది. ఆ పైన అంతా దట్టమైన అరణ్యం. ఆ అడవి రేఖామాత్రంగానే కనిపించింది గాని వివరంగా కానరాలేదు. ఈరాత్రి ఎలా గడపటమా అని బార్నీ మార్టిన్ ఆలోచించారు.

“ఈ తీరంలో ఇళ్లేమీ ఉండవనుకుంటాను. వాటికోసం వెదకడం వృధాశ్రమ. ఒకవేళ ఉన్నా, వాటిలో ఆటవికజాతివారు ఉంటారేమో. కనక, మనం ఆ అడవిలోకి పోయి ఏ చెట్టుకిందో—”అని బార్నీ అంటూండగానే, అడవిలోంచి హీనస్వరంతో ఒక అరుపు వినవచ్చింది. అటువంటి అరుపు వారెప్పుడూ విన లేదు.

“అడవిలోకి పోవడం క్షేమంకాదనుకుంటాను. ఇక్కడే ఉందాం ఈ రాత్రికి,” అని ముగించాడు బార్నీ.

“అవును. అదే మంచిది,” అని మార్టిన్ నిప్పు చెయ్యడానికి పుల్లలకోసం వెదికాడు. “అడవిలో క్రూర జంతువులు ఉండవచ్చు. కనుక తెల్లారేదాకా ఇక్కడి నుంచి కదలవద్దు.”

పిస్తోలు చెకుముకిరాయి సహాయంతో కొంచెం ఎండుగడ్డిని మండించారు. కాని మంట ఆరిపోకుండా వెయ్యడానికి తగినన్ని పుల్లలు దొరకలేదు. బార్నీ అడవిలోకి వెళ్లి కొన్ని పుల్లలు కొట్టుకువస్తానని బయలుదేరాడు. “నా జోళ్లు, మేజోళ్లు ఈ నిప్పుమీద వెచ్చచెయ్యి. కాల్చివేసేవు సుమా”అని జోళ్లు విప్పి బయలుదేరాడు.

మైదానం దాటి బార్నీ అడవిలో ప్రవేశించి ఎండిపోయిన కొమ్మలను కత్తితో నరకసాగాడు. అట్లా కొడుతూఉండగా, ఇందాక వినిపించిన అరుపు మళ్ళీ వినిపించింది. బార్నీ ఉలికిపడ్డాడు. “అదేం జంతువో తెలిస్తే బాగుండునే?” అనుకున్నాడు.

అనువాదం: నండూరి రామమోహనరావు

ఇంతలో మరోరకం అరుపు, దానితర్వాత మొదటిరకం అరుపు వరసగా వినపడ్డాయి.

పళ్లుబిగించి, కనుబొమలు ముడిచి, ధైర్యం తెచ్చుకుని బార్నీ తన పని తాను చేస్తున్నాడు. అతడు సహజంగా శత్రువు ఉన్నప్పుడు అతన్ని మించిన ధైర్యవంతుడు లేడు. కాని కనిపించని శత్రువు తటస్థపడితే అతనిధైర్యం ఏం పనికివస్తుంది? హఠాత్తుగా ఒక పెద్ద గబ్బిలం అతని ముక్కు రాచుకుంటూ, నిశ్శబ్దంగా పోయింది. అటువంటి ఆకారం అంతకుముందెన్నడూ అతడు చూడలేదు. అది గబ్బిలమనికూడా అతనికి తెలియలేదు. దయ్యమేమోనని అనుమానం తట్టింది. మళ్ళీ అతనికళ్లకు దగ్గరగా ఎగురుతూ వెళ్ళింది.

"దయ్యం కానీ, గియ్యంకానీ, ఈసారి రానీ, చంపుతాను" అని బిగ్గరిగా అనుకుని, కత్తిఎత్తి పట్టుకుని చుట్టూ చూస్తున్నాడు. అలా చూస్తుండగా వెనుకపాటుగా వచ్చి గబ్బిలం అతని చెవిని రాచుకుంటూ పోయింది. కత్తితో ధన్‌మని కొట్టాడు. అది గబ్బిలానికి తగలడానికి బదులు పక్కనేఉన్న చిన్న చెట్టుకు తగిలి అందులో ఇరుక్కుపోయింది. చెట్టు గజగజలాడింది. పండిన పళ్ళేవో జలజల అతనిమీద రాలాయి. అవి రాలడంతో 'బాబోయ్' అని అరిచి వెనక్కి అడుగువేశాడు. కారణం లేకుండా భయపడినందుకు సిగ్గుపడి, అంతవరకూ కొట్టిన పుల్లలన్నీ పోగుచేసి, బుజానపెట్టుకుని గబగబ బయలుదేరాడు. వస్తూ వస్తూ ఒక చిన్నపాముమీద కాలువేశాడు. పాము మెలికలు తిరిగి అతని కాలు చుట్టవేసుకుంది. బార్నీకి ఏమున్నా భయంలేదుగాని, పాములంటే విపరీతమైన భయం. పెద్ద గావుకేకపెట్టి, బుజాన పుల్లలమోపు కింద పారవేసి, ఒడ్డుకు పరుగులంకించుకున్నాడు. సముద్రంలో మోకాలిలోతువరకూ పోయినదాకా అతడు ఆగలేదు.

"మార్టిన్! అడవినిండా దెయ్యాలేనోయ్. లోకంలోని దెయ్యాలన్నీ అక్కడే ఉన్నాయి," అన్నాడు బార్నీ ఒగరుస్తూ.

"దెయ్యాలా!" అని నవ్వాడు మార్టిన్. "దెయ్యాలనేవి అసలులేవు. ఉన్నా, వాటిని ఎదిరిస్తాను. మనకిప్పుడు కట్టెపుల్లలు అత్యవసరం. లేకపోతే ఈ నిప్పు ఆరిపోతుంది. పద నేనుకూడా వస్తాను."

"జోళ్లు తొడుక్కుని మరీబయల్దేరేను. దెయ్యాలంటే భయపడకపోయినా, పాములకైనా భయపడాలి కదా. కొన్ని కొన్ని పాములకు విషం ఉంటుందట," అన్నాడు బార్నీ.

ఆట్టే వెదకకుండానే పుల్లలమోపు కనిపించింది. అది తీసుకువచ్చి మంట పెద్దదిచేశారు. మంటదగ్గర కూర్చుంటే హాయిగా ఉంది. తినడానికేమీ లేనిమాట నిజమే. ఆ సాయంత్రం ఖద్యోతనాకలో దిట్టంగా తినడంచేత ఇప్పుడు ఆకలిగాలేదు. కనుక తిండిబెంగ లేదు. అలాకూర్చుని తమ నిస్సహాయస్థితినిగూర్చి ముచ్చటించుకున్నారు. ఇంతలో దూరంగా ఉరుములధ్వని వినబడింది. బార్నీ భయపడి లేచాడు.

"ఏమిటది బార్నీ?" అన్నాడు మార్టిన్.

"వస్తోంది, వస్తోంది" అంటూ బార్నీ ఆకాశంకేసి ఆందోళనగా చూశాడు.

"వానేగా వచ్చేది. వస్తే రానీ. ఆ పొదలకింద దాక్కుందాం"

"ఈ ఉష్ణమండలాల్లో వాన ఎప్పుడైనా చూశావా?" బార్నీ అడిగాడు.

"లేదు."

"అయితే నేను చెప్పినట్టు విని, మాట్లాడకుండా నా వెంటరా," అని బార్నీ బయల్దేరాడు. కత్తి, పిస్తోలు బెల్టులో దోపుకుని అడవికేసి, పరిగెత్తాడు. మార్టిన్‌కూడా ఎందుకో అని ఆశ్చర్యపడుతూ పరిగెత్తాడు.

వారు పరిగెత్తడం మంచిదే అయింది. నల్లటి మబ్బులు అన్నిదిక్కులనుండీ బయలుదేరి చూస్తుండగానే ఆకాశమంతా మేఘాచ్ఛన్నమైపోయింది. వారు అడవిలో అడుగుపెట్టారో లేదో, గాఢాంధకారం, చేత్తో ముట్టుకోవచ్చుననిపించేటంత దట్టమైన అంధకారం ఆవరించింది. వెంటనే ఒక మెరుపు మెరిసింది. ఎండ హఠాత్తుగా వచ్చి హఠాత్తుగా మాయమైనట్లు అనిపించింది. మెరుపు తరవాత చీకటి పదిరెట్లు దట్టమైనట్లు తోచింది. ఎక్కడో పిడుగుపడింది. ఆకాశంలో గోళాలు ఒకదానొకటి ఢీకొంటున్నట్లు ఉరుములు ధమధమ ధ్వనిచేశాయి. మెరుపుమెరిసినప్పుడు ఆ క్షణంసేపు కాంతిలో మన మిత్రులకు ఒక మహావృక్షం కనిపించింది. దాని కొమ్మలు, ఆకులు గుబురుగా ఉన్నాయి.

దానికిందికి ఇరువురూ పరుగెత్తారు. చెట్టెక్కి కొమ్మల మధ్య కూర్చున్నారో లేదో వర్షం ప్రారంభమైంది. ప్రారంభం కావడమే ఉధృతంగా ప్రారంభమైంది. అటువంటి వర్షం మార్టిన్ ఎన్నడూ చూడలేదు, అటువంటివర్షం కురుస్తుందని అతడు ఊహించనుకూడా లేదు. వెడల్పాటి బరువైన ఇనపరేకులు కురుస్తున్నట్టు జలధారలు పడ్డాయి. హోరున ఒకటే ధ్వనికూడా ప్రారంభమైంది.

గాలి తీవ్రంగా వీచింది. చెట్లు వంగాయి. ఎత్తైన చెట్లకొమ్మలు పెద్దపెద్దవి ఫెళఫెళా విరుచుకుపడ్డాయి. ఆకాశంలో ప్రకృతిశక్తులమధ్య జరిగే ఆ ఘోర యుద్ధానికి భూమికూడ భయపడి వణికిపోతున్నట్లు తోచింది. ఇంతటితో సృష్టి అంతమొందుతుందని పించింది. కొమ్మలమధ్య కూర్చుని హఠాత్తుగా ఆ బీభత్సాన్ని చూస్తూ, తాము ప్రకృతి శక్తులమధ్య ఎంత నిస్సహాయులో, ఎంత దుర్బలులో ఆలోచిస్తూ దేవుణ్ణి ప్రార్థించడంకంటే మరేమీ చేయలేక పోయారు.

కొన్ని గంటలసేపు వర్షంసాగింది. అప్పుడు ఎంత హఠాత్తుగా వచ్చిందో అంత హఠాత్తుగానూ ఆగిపోయింది. మళ్ళీ తారలు ఆకాశపు రంగస్థలం మీదికి అవతరించి ప్రకాశించాయి.

మార్టిన్, బార్నీ చెట్టుదిగి వచ్చి సముద్రపు టొడ్డుకే పోదామని నడిచారు. కాని అది సాధ్యం కాలేదు. తొందర తొందరగా అడవిలోకి రావడంలో సముద్రం ఏ దిక్కున ఉన్నదోకూడా మరిచిపోయారు. ఇంతసేపు వానలో కూర్చున్న తరవాత ఇప్పుడు దోవ అసలే తెలియలేదు. అంతకంతకూ అడవిలోకే చొచ్చుకుపోయారు. నడిచి నడిచి అలిసిపోయారు. చీకట్లో మాటిమాటికీ కాలుజారి పడ్డారు. ఇక లాభం లేదని, తెల్లారేదాకా అక్కడే గడప నిశ్చయించారు. మరికొంతదూరం నడిచి, అక్కడ కొంచెం బయలుగా ఉండంచేత, ఆగారు. ఒక చెట్టుకింద పొడిగా ఉన్న చోటు చూసుకుని, చెట్టుకు ఆనుకుని, గాఢంగా నిద్ర పోయారు.

# 8

"ఆహాహా! భూలోకస్వర్గం!"

దక్షిణ అమెరికాతీరాన దిగిన మర్నాడు ఉదయం మార్టిన్ రాట్లర్ నిద్రలేస్తూనే విన్న మాట లివి.

కిందటిరాత్రి ఏ చెట్టుకిందపడి నిద్రపోయారో, ఆ చెట్టుకిందే వెల్లకిలా పడుకుని ఒక లావాటి వేరును తలగడగా పెట్టుకుని, ఆశ్చర్యంగా చూస్తూ బార్నీ ఓఫ్లానగన్ అన్న మాటలవి.

మార్టిన్ కళ్లు తెరిచిచూసి తనుకూడా ఆశ్చర్యపడ్డాడు. వారు అలా ఆశ్చర్యపడడంలో ఆశ్చర్యమేమీ లేదు. గతసాయంకాలం సముద్రంమీద ఉండగా సూర్యకాంతి చూశారు. మళ్ళీ సూర్యకాంతి వచ్చేసరికి బ్రెజిల్ దేశపు అద్భుతారణ్యాలలో ఉన్నారు.

వాళ్ళు ఆశ్చర్యంతో నిశ్చేష్టులైపోవడానికి కారణం లేకపోలేదు. కళ్లు చెదిరిపోయే అటువంటి దృశ్యం వారింతకుమున్నెన్నడూ చూడలేదు. దట్టమైన వృక్షసముదాయమే ఎటు చూసినా కనబడింది. మొక్కలు, పొదలు, పువ్వులు చిత్రచిత్రమైనవి, రంగు రంగులు గలవి కళ్ళఎదుట నాట్యంచేశాయి. ఒక్క దాని పేరూ, ఉపయోగమూ వారికి తెలియదు. ఆకారంలో, పరిమాణంలో, వర్ణంలో భిన్నభిన్నమైన అత్యున్నత వృక్షాలు బారులుతీరి ఉన్నాయి. కొన్ని చెట్ల మొదళ్లు ఇరవై అడుగుల కైవారం కలిగి వున్నాయి. కొన్ని సన్నగా, పొడవుగా, నిటారుగా ఉన్నాయి. కొన్ని ఒకదానొకటి మెలికలు వేసుకుని పైకి పెరిగాయి. కొన్ని చెట్లమొదళ్ళకు చుట్టూ, అవి పడిపోకుండా కాపాడడానికా అన్నట్లు వెడల్పాటి చెక్కలవంటివి పెరిగాయి. ఫలభారంతో, శాఖాభారంతో కొన్ని చెట్లు వంగాయి. నారింజ వృక్షాలు పండిన పళ్లతో బంగారంలాగ మెరిసిపోతున్నాయి. తాళవృక్షాలు ఠీవిగా అన్నిచెట్లకంటె ఎత్తుగా పెరిగి విసనకర్రలవంటి కొమ్మలను గాలిలో ఊగిస్తున్నాయి. అరటిచెట్లు విశాలమైన ఆకులను కదిలిస్తూ చల్లని నీడ కలగజేస్తున్నాయి.

ఈ చెట్లన్నిటినీ పెనవేసుకుని అసంఖ్యాకమైన

లతలు పైకి పెరిగి తోరణాలవలె వేలాడుతున్నాయి. కొన్ని లతలు తాము పెనవేసుకున్న చెట్లను తామే చంపి, ఎండిపోయేట్లు చేస్తున్నాయి. లతల తాలూకు పువ్వులు, చెట్ల తాలూకు పువ్వులు కలిసిపోయి ఏవి వేనివో తెలియరావటంలేదు.

పక్షులు—అబ్బ! కొన్ని వేల అద్భుత పక్షులు! వాటి ఈకలలో ఆకుపచ్చనివి, బంగారువన్నెవి, ఎర్రనివి, పసుపుపచ్చనివి, నీలపువి ఉన్నాయి. నవనవలాడుతూ, ధగధగ మెరుస్తున్నాయి. శరీరం ఎంత పొడుగున్నదో, ముక్కు అంత పొడుగున్న పెద్ద పక్షులు చెట్టుచెట్టుకూ ఎగురుతున్నాయి. తేనెటీగ అంత చిన్నపక్షులు సంగీతంలాగా ఏదో ఆలాపిస్తూ పువ్వు పువ్వుకూ ఎగురుతున్నాయి. ఈ చిన్నపక్షులకు కోపం ఎక్కువ కాబోలు; నిముష నిముషానికీ తమలో తాము దెబ్బలాడుకుంటున్నాయి. విశాలమైన నీలమైన రెక్కలుగల సీతాకోక చిలుకలు హుషారుగా తిరుగుతున్నాయి.

కొమ్మలమధ్య ఆకులచాటున దాక్కుని జోరెడు కోతులు 'ఈ కొత్తవా రెవరా?' అని ఆశ్చర్యంతో చూస్తున్నాయి. మళ్ళీ భయపడి, కీచుకీచుమని గోదచేస్తూ చెట్టునుండి చెట్టుకు రయ్యిన ఎగిరి దూకి పారిపోతున్నాయి. కొన్ని పెద్దవిగా, ఎర్రగా,

అసహ్యంగా ఉన్నాయి. వాటి ముఖాలు నీలంగా వికృతంగా ఉన్నాయి. ఎవరో బంధువులు చచ్చిపోతే ఏడుస్తున్నట్టు మొహాలుపెట్టి చాలా విచారంగా కనిపించాయి. కొన్ని కోతులు బాగా చిన్నవిగా అందంగా ఉన్నాయి. కోతి ఎంత చిన్నదైతే తోక అంత పొడుగ్గా ఉన్నట్టు బార్నీ గ్రహించాడు.

మధురమైన సువాసనలు, సుందరమైన దృశ్యాలు, హాయిగొలిపే కిలకిలారావాలు వారిని తన్మయులుగా చేశాయి. ఇది భూలోకమా, మరో లోకమా అనిపించే ఆ వాతావరణంలో కళ్ళు తెరచిన బార్నీ "ఆహాహా! భూలోక స్వర్గం!" అన్నాడంటే ఆశ్చర్యం ఏముంది?

బార్నీ లేవడానికి ప్రయత్నించాడు. అప్పుడు గాని అది స్వర్గంకాదని, అక్కడా కొన్ని బాధలు ఉన్నాయని తెలియలేదు. రాత్రంతా తడిబట్టలతోనే పడుకుని నిద్రపోవడంవల్ల, వళ్ళంతా బిగుసుకుని నొప్పి పెడుతోంది. రాత్రి తెల్లవార్లూ దోమలు కుట్టడంవల్ల మొగమంతా వాచిపోయింది.

"చావండి" అంటూ కోపంగా తన మొహం మీద తనే దెబ్బవేశాడు. ఆ దెబ్బకి కనీసం రెండు మూడు వందల దోమలు కాలధర్మం చెందాయి. వెంటనే మరికొన్ని వేల దోమలు ముట్టడించాయి. వీటితో ఈవిధంగా కుస్తీపట్టి లాభంలేదని, ఓర్పు వహించాలని బార్నీ గ్రహించాడు. ఓర్పే కాకుండా పొగకూడా ఈసందర్భంలో పనికివస్తుందని అతడు అనతికాలంలో గ్రహించాడు.

"మనం ఏం తిందాం బార్నీ?" మార్టిన్ ప్రశ్నించాడు.

"నీ ఇష్టం వచ్చింది తిను" అని బార్నీ ఆ అరణ్యమంతా తన సొంతమైనట్టు చుట్టూ చూపించాడు.

"నేను నారింజలు తింటాను," అని ఒక చెట్టు దగ్గిరికి వెళ్లాడు.

"నేను రేగుపళ్లు తింటాను" అన్నాడు బార్నీ.

ఇద్దరూ చెట్లెక్కి చాలాపళ్లు రకరకాలవి కోసి చెట్టుకింద పోగుచేశారు. నిప్పు రాజెయ్యడానికి బార్నీ ప్రయత్నించాడు. వండడానికి పదార్థాలున్నాయని మంటకూడా ఉంటే బాగుంటుందని, పొగకి దోమలు ఈగలు తొలగిపోతాయని అతని ఆలోచన. కాని నిప్పుచెయ్యడం తేలికగా సాధ్యంకాలేదు. కిందటి రాత్రి కురిసిన వానకి అన్నీ తడిసి నానిపోయి ఉన్నాయి. ఎండుగడ్డి ఒక్క పోచఅయినా దొరక లేదు. చాలాసేపు వెదకి వెదకి చివరికి కొంత సంపాదించి దాన్ని పిస్తోలుమందులో రాచిరాచి, ఎండ బెట్టి ఎలాగైతేనేం తంటాలుపడి వెలిగించాడు.

వారు కోసిన పళ్ళలో కొన్ని తియ్యగా ఉన్నాయి; కొన్ని చేదుగా ఉన్నాయి. చేదువి పారేసి తీపివి తిన్నారు. తరవాత ఏం చేయడమా అని ఆలోచించారు.

"ఈ చిలకలతో, ఈ కోతులతో మనం ఉండలేము. ఇక్కడెక్కడైనా పట్నవాసమో, పల్లెవాసమో ఉందేమో వెదకాలి. అదృష్టం బాగుంటే ఏదైనా ఓడకూడా కనబడవచ్చు," అని మార్టిన్ అన్నాడు.

"నిజమే" బార్నీ అన్నాడు: "మనకి ఈ ప్రాంతంలో తుదా మొదలూ తెలియదు కనుక, ముక్కుకు సూటిగా పోదాం. ఏదన్నా తగిలేదాకా అలా పోవడమే మంచిది."

"అదే నేనూ అనుకుంటున్నాను. ఆలస్యమెందుకు, తక్షణం బయలుదేరుదాం."

సర్దుకోడానికి మూటా ముల్లె లేదు కనుక కూర్చున్నవాళ్ళల్లా నుంచోవడమే తరవాయిగా బయల్దేరారు.

(ఇంకా ఉంది)

పూర్వం ఒక రైతు ఉండేవాడు. అతనికి రామయ్య, భీమయ్య, సోమయ్య అని ముగ్గురు కొడుకులు. రైతు చనిపోతూ పెద్దవానికి పొలం, రెండోవానికి తన గుర్రం, మూడోవానికి ఒక పిల్లి ఇచ్చి చనిపోయాడు.

మూడోవాడైన సోమయ్యకు చాలా విచారం కలిగింది. ఆ పిల్లితో ఏం చెయ్యాలో తోచ లేదు. తన అన్నలకి జీవనోపాధికి పనికివచ్చేవి ఉండగా, తనకు ఎందుకూ కొరగానిపిల్లి దొరికిందేమిటా అని చింతించాడు. అతని చింతచూసి మార్జాలం ఇలా అంది: "అయ్యా! మీరు చింతించవద్దు. పొలంకంటె, గుర్రంకంటె నేనే గొప్పదాన్నని మీకు నిరూపిస్తాను. కాళ్ళకిజోళ్ళు, ఒక సంచి కొని పెట్టండి ముందు."

సోమయ్య తన డబ్బంతా ఖర్చు పెట్టి ముద్దొచ్చే చెప్పులు, ఒకసంచీ కొన్నాడు.

పిల్లి చెప్పులు తొడుక్కుని, సంచీ భుజాన వేసుకుని వెళ్ళింది. ఎక్కడో కొంత గోధుమ పొట్టు సంపాదించి సంచీలో పోసుకుంది. చచ్చిపోయినట్టు కదలకుండా పడుకుంది. గోధుమ పొట్టుకోసం ఆశ పడి ఒక చెవులపిల్లి సంచీలో దూరింది. పిల్లి గభాలున దాన్ని పట్టుకుని చంపి, ఆ దేశపురాజుగారి వద్దకు పట్టుకెళ్లింది. "రాజా! విజయపుర యువరాజుగారు మీకు కానుకగా ఒక చెవులపిల్లిని పంపించారు. దీన్ని ఉల్లిపాయలతో ఉడకబెట్టి తింటే ఎంత రుచిగా ఉంటుందో, మీరే తినిచూడాలి", అన్నది.

"చెవులపిల్లి మాంసం తినాలని నా కెన్నాళ్ళనుండో ముచ్చటగా ఉంది. మావంటివాడికి ఇంతవరకెక్కడా దొరకలేదు. అహో ఏమి నా అదృష్టం. మీ యువరాజుకు నా నమస్కారాలని చెప్పు" అన్నాడు రాజుగారు.

మరుచటి ఉదయం పిల్లి రెండు తెల్లపావురాలను పట్టిచంపి మళ్ళీ యువరాజుగారే పంపించారని చెప్పి రాజుగారికిచ్చింది. రాజుగారు ఆనందం పట్టలేకపోయారు. వెంటనే, తన కుమార్తెను వెంట పెట్టుకుని రథం ఎక్కి విజయపుర యువరాజును చూడడానికి బయలు దేరారు.

వెంటనే పిల్లి సోమయ్య దగ్గిరికి పరిగెత్తుకెళ్ళింది: "నాతో రా. నీ కొక చెరువు చూపిస్తాను. అందులో నువ్వు శుభ్రంగా స్నానం చెయ్యాలి" అన్నది.

రాజుగారి రథం వెళ్ళేబాట పక్కన ఉన్న చెరువుదగ్గిరికి సోమయ్యను తీసుకువెళ్ళింది. చిరిగిపోయిన అతని గుడ్డలను దూరంగా ఒక బండరాతికింద దాచింది. అతన్ని చెరువులో దిగి స్నానం చేస్తూ ఉండమంది.



ఆంధ్ర రెవెన్యూబోర్డు ఉద్యోగులు ఆంధ్రరాష్ట్రావతరణోత్సవం చేసుకున్నప్పుడు నాట్యం చేసిన బాలలు.

కొంతసేపటికి రాజుగారు ఆ మార్గాన వచ్చారు.

"అయ్యో, అయ్యో" అని పిల్లి ఆక్రోశించింది.

"ఏమి టేమిటి" అని రాజుగారు ఆదుర్దాగా అడిగారు.

కొంపమునిగింది బాబూ! మా యువరాజుగారు నీళ్ళలో దిగి స్నానం చేస్తుండగా దొంగలువచ్చి, ఆయనబట్టలు ఎత్తుకుపోయారు. ఆయన నీళ్ళలో ఉన్నారు. బట్టలు లేందే ఎలా బయటికి రావడం? నీళ్ళలో నానితే జలుబు చేస్తుందో ఏమిటో ఖర్మ..." అన్నది.

రాజుగారు తన సేవకులలో ఒకణ్ణి పిలిచి వెంటనే కోటకుపోయి తను పెళ్ళినాడు తొడుక్కున్న విలువైన బట్టలు తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. అవి రాగానే వాటిని సోమయ్య తొడుక్కున్నాడు. వాటిలో అతడు నిజంగా దేదీప్యమానంగా ప్రకాశించాడు. అతన్ని చూస్తూనే రాజుగారి కుమార్తె అతన్ని ప్రేమించేసింది. రాజుగారికే ఆశ్చర్యం వేసింది అతని అందం చూసి. "అదిగో అమ్మాయ్! నేను కూడా పెళ్ళి కిందట మీ అమ్మని పెళ్ళిచేసుకున్న రోజున అలాగే ఉన్నాను," అని సహాస్యంగా చెప్పాడు.

పిల్లి తన ఎత్తుపారినందుకు సంతోషించి, మళ్ళీ ముందుకు పరుగెత్తుకు పోయింది. కొన్ని పొలాలు కనిపించాయి. అందులో పనిచేసే రైతులనుపిలిచి అది ఇలా అంది: "రాజుగారు వస్తున్నారు. ఈపొలాలన్నీ విజయపుర యువరాజుగారి సొంత భూములని ఆయనతో మీరు చెప్పాలి. అలా చెప్పకపోతే మా యువరాజుగారు మిమ్మల్ని సర్వ నాశనం చేస్తారు."

రాజుగారు రథంలో అక్కడికి వచ్చారు. "ఈ పొలాలన్నీ ఎవరివి?" అని అడిగారు. "విజయపుర యువరాజుగారివేనండి," అని రైతు లంతా సమాధానం ఇచ్చారు.

"అబ్బో! ఎన్ని పొలాలున్నాయండీ మీకు?" అని రాజుగారు సోమయ్యను చూసి ఆశ్చర్యంగా అన్నాడు. సోమయ్య తెల్లబోతూ చిరునవ్వు నవ్వాడు. రాజు



....దేనికోసం?

ఫోటో: ఎస్. ప్రసాద రావు—విజయవాడ.

# 17. ఘరానా దొంగలు

ఒక జామతోటలోకి రెండు కోతులు ప్రవేశించాయి.

"మన జాతివాళ్లకి దొంగతనం బాగా అలవాటైపోయింది. ఈ అలవాటు పోగొట్టాలి," అని నిశ్చయించాయి.

"ముందు మనంతట మనమే నిగ్రహం నేర్చుకోవాలి. మన్ని మనం అదుపులో పెట్టుకోవాలి. ఒకపని చేద్దాం: నువ్వు నన్ను చూస్తూఉండు. నిన్ను నేను కనిపెట్టి ఉంటాను. అప్పుడు మనం దొంగతనం చేద్దామనుకున్నా వీలు పడదు," అని ఒక కోతి అన్నది.

"అమోఘమైన ఆలోచన," అన్నది రెండో కోతి.

సరే, ఒకదాన్నొకటి కాపలా కాయడం మొదలెట్టాయి.

కొంతసేపటికి, ఒకటి ఎటో చూస్తూ ఉండగా, రెండోది లటుక్కున ఒక జామపండుకోసి నోట్లో కుక్కుకుని, ఏమీ ఎరగనట్టు, రెండో కోతికేసి చూడసాగింది.

కాని ఆ కోతి జామపండు కోసే టప్పుడే, ఇంకో కోతి తనుకూడా మరో జామపండు కోసుకుని నోట్లో పెట్టుకుని గప్ చిప్ గా చూడసాగింది.

ఈవిధంగా రెండు మర్కటాలూ నోళ్లుమూసుకుని ఒకదాన్నొకటి మౌనంగా చూసుకున్నాయి.

చివరికి దీని రహస్యం దానికీ, దాని రహస్యం దీనికీ తెలిసిపోయింది.

"ను ... ను...నువ్వు..." అని కోపంగా మొదటికోతి రెండో కోతిని ఏదో అనబోయి నోరు మూసుకుంది.

రెండోదికూడా కోపం తెచ్చుకుని "ను...నువ్వో..." అని చటుక్కున నోరు మూసేసుకుంది.

'ఛీ, దొంగబుద్ధి, పోనిచ్చుకుంది కాదు' అని దాన్ని ఇదీ, దీన్ని అదీ అసహ్యించుకున్నాయి. ఎంత అసహ్యం వేసినా, అవి చేసిన పనికి వాటికే నవ్వు వచ్చింది. "హహ్హహ్హ" అని రెండూ పగలబడి నవ్వాయి. వెంటనే రెండు జామపళ్లూ కిందకి దొర్లాయి.

నవ్వుకుంటూ దేని జామపండు అది తీసుకుంది. అప్పుడు రెండూ కలిసి గొంతెత్తి,

"నాకు తెలుసులే
నీ కిటుకూ...
నీకు తెలుసులే
నా కిటుకూ...
అయినా గప్ చిప్
మన నోళ్లుమటుకూ..."

అని పాట పాడాయి.

తరవాత ఎంతో గౌరవ భావంతో ఒకదానికొకటి వంగి నమస్కరించి, జామపళ్ళు నోట్లో వేసుకుని నెమ్మదిగా నములుతూ "తేలిగ్గా తేల్చేశాం గదూ, మన తగాదా?" అని పరస్పరం అభినందించుకున్నాయి. ★

## ★ పిల్లి చేసిన పెళ్లి ★

గారు,కూతురు చెవిలో "చూశావా? యువరాజు తెల్లమొహం వేశాడు. నేను మీ అమ్మని పెళ్ళిచేసుకున్న రోజున కూడా అలాగే తెల్లబోయి చూశాను" అన్నాడు.

పిల్లి ఇంకా ముందుకుపోయింది. ఒక అడవిలో ప్రవేశించింది. అక్కడొక బ్రహ్మాండమైన రత్నాల భవనం ఉన్నది. అందులో ఒక రాక్షసుడు ఉంటున్నాడు. ఇందాకటి పొలాలన్నీ ఆ రాక్షసుడివే. పిల్లి రాక్షసుడి దగ్గరికెళ్ళి నమస్కరించి "ఏమండీ, మీ గొప్పదనం దేశదేశాలకి పాకింది. నేను నాలుగు వేల మైళ్ళ దూరం నుంచి వస్తు వస్తున్నాను, మిమ్మల్ని చూడడానికి. మీరు ఏ రూపం కావలిస్తే ఆ రూపం ధరించ గలరట గదా?" అన్నది.

"నిజమే" అని రాక్షసుడు సింహంగా మారాడు.

"సింహంగా మారడం కష్టం కాదులెండి. కొంచెం గాలి పూరిస్తే ఎవరైనా కొంచెం లావుగా కనిపిస్తారు. చిన్న ఆకారానికి మారడమే కష్టం. మీరు ఎలుకగా మారగలరా?" అని ప్రశ్నించింది పిల్లి.

"అబ్బే చాలా తేలిక. నీకు తెలియదా ఏమిటి? ఇదుగో చూడు",



పిం బె ళి డి.

ఛాయాచిత్రకారుడు: ఎన్. శివరావ్ — మద్రాసు.

అంటూ ఆ వెర్రిబాగుల రాక్షసుడు ఎలుకగా మారాడు. మారీ, మారగానే పిల్లి దూకి దాన్ని పట్టుకుని తినేసింది.

ఇంతలో రాజుగారి రథం అక్కడికి వచ్చింది. ఒక పెద్ద భవనం తలుపులు తెరిచి పిల్లి రాజుకి స్వాగతమిచ్చింది, "రండి, ఇదే మా యువరాజుగారి భవనం!" అంటూ.

రాజుగారు "అబ్బ! ఏం భవనం! ఏం భవనం!" అన్నాడు. తను సరే. "యువరాజా! మా అమ్మాయిని కొంచెం చెయ్యి పుచ్చుకుని రథం దింపండి" అన్నాడు. సోమయ్య సిగ్గుపడుతూ యువరాణి చెయ్యిపుచ్చుకున్నాడు. 'నేను మీ అమ్మను పెళ్ళాడినప్పుడు, పెళ్ళిలో అలాగే సిగ్గుపడ్డాను" కూతురితో అని మళ్ళీ సిగ్గుపడ్డాడు రాజుగారు.

పిల్లి వంటశాలలోకి వెళ్ళి రకరకాల పదార్థాలు, పానీయాలు తయారు చేయించి, మహారాజులకు తగిన విందు ఏర్పాటు చేసింది. క్షణంలో అన్నీ తయారైనాయి. రాజుగారు కడుపుపట్టినంత తిని త్రేపుతుంటూ సోమయ్యతో ఇలా అన్నాడు. "యువరాజా! మీరు సిగ్గుపడుతూ తృప్తిగా ఏమీ తిననే లేదు. నేనూ నా పెళ్ళిలో ఇలాగే సిగ్గుపడి ఏమీ తిననేలేదు. మిమ్మల్ని చూస్తే మా అమ్మాయిని ప్రేమించినట్టు కనబడుతున్నారు. ఆమెకూడా మిమ్మల్ని ప్రేమించినట్టు కనబడుతోంది. మరి ఇక అభ్యంతరం ఏముంది పెళ్ళికి?"

సోమయ్య సిగ్గుపడుతూనే తనకేమీ అభ్యంతరం లేదన్నాడు.

ఆ తరువాత సోమయ్యకు యువరాణితో వైభవంగా పెళ్ళిజరిగింది. పెళ్ళికి పిల్లి రాకూడదని అంటారు. కాని సోమయ్యపెళ్ళి సోమయ్య పిల్లి రాకుండా ఎలా జరుగుతుంది. అరిగిపోయిన పాతచెప్పులు పారేసి, మహారాజులు తొడుక్కునే బంగారపు నగిషీ, జరిగల చెప్పులు తొడుక్కొని దర్జాగా వచ్చి తన యజమాని పెళ్ళిని అలంకరించింది.

★

# ★ ముక్కు ★

(11 వ పేజీ తరువాయి)

తర్వాత నే కనుక్కొన్నారు రసికులు. ఆ మీదట "ముక్కు తిమ్మనార్యుముద్దుపలుకు" అని ఆయన కవిత్వాన్ని మెచ్చి మురిసిపోయారు. పెద్దనామాత్యుడు ముక్కును గురించి యేదీ చెప్పినట్లు తోచదు గాని, ఆయన ముక్కు మాత్రం అసాధ్యమైనది. ఆయనగారి ముక్కును ఈ కాలంలో అయితే ఇన్స్యూరు చేసేవారు. "మృగమద సౌరభ విభవ - ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగంధ - స్థగితేతర పరిమళమై - మగువ పొలుపు తెలుపు నొక్క మారుత"మును ఆయన ముక్కు గుర్తించగలిగింది. "నిరుపాధి స్థలం"లో "రమణీప్రియదూతిక" తెచ్చి ఇచ్చే తాంబూలంలోని కస్తూరి (మాత్రల?) పచ్చకర్పూరపు వాసనలే "మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధం"గాను, అంతకు మించి ఆ విడెము తెచ్చిన అమ్మాయి వాసనే "మగువపొలుపు తెలుపు మారుతం"గానూ మనుచరిత్రంలో వెలిసి మనదాకా వచ్చింది. అటువంటి అంగరంగ వైభోగాలను త్యజించి, "శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్" అని కవిత్వం మొదలు పెట్టిన పోతన ముక్కు "నీరజాత నయన నీ వనమాలికా గంధ మబ్బునేని ప్రాణ మేల?" అని దివ్యవాసనలవైపు వెళ్ళింది. అభ్యకథలలోని రాక్షసుని ముక్కుకు "నరవాసన" ఘుమ ఘుమ లాడుతూ పట్టుపడిపోతుంది. అసలు ఏ వాసనా కనిపెట్టలేని ముక్కును, "గాడిద కేమెరుగు గంధపొడి వాసన" అని గాడిదముక్కుకు, "పంది మురికి మెచ్చు పన్నీరు మెచ్చునా?" అని పంది ముక్కుకు పోలుస్తారు.

కొన్ని అక్షరాలను ముక్కుతో పలకవలసి వస్తుంది. వానిని వ్యాకరణ వేత్తలు "అను నాసికములు" అని విభాగించినారు. అసలు మళయాళ భాష, చైనా భాష ముక్కు యాస (*Nasal accent*) తోనే మాట్లాడుతారు. ముక్కుతో చదివితేనే కొందరికి పద్యం సాగుతుంది. కొందరికి పాటం ముక్కు నిండా కూరితేనే కలం సాగుతుంది. ఆ రీతిగా నశ్యానికి వశమైన వారికి అది లేకుంటే "ముక్కుబుర్రలు మురిగిపోతవి."

మనలో చాలామందికి "ముక్కు కు సూటిగా" వెళ్ళడం అలవాటు. సోమరిపోతులు పని చేయడానికి "ముక్కుతో ఏడుస్తారు." దాన్నే "మూక్కాలై అళరదు" అని తమిళులు అంటారు. "ముక్కుమీద కోపం" కలవారు "ముక్కోపి" అని బిరుదు పొందుతారు. చీటికి మాటికి చిన్న విషయాలకు కోపగించే వారితో పడలేక విసిగి "చీదితే పోయేముక్కు ఎన్నాళ్ళుంటుంది లెమ్మని" ఉపేక్షిస్తారు. ఆ సందర్భంలోనే "తుమ్మితే ఊడిపోయే ముక్కును ఎన్నాళ్ళు ఆపగలం?" అని కూడా అంటారు. కక్కుర్తి మనుష్యులకు ఎంత తిన్నా "ముక్కులోకి" చాలదు. కాని వారు "ముక్కుదాకా"నే తింటారు. "మూతీ ముక్కు చూసి" గిట్టని వారి మనస్సు నొప్పించడం కొందరికి దురలవాటు. మధ్యతరగతి సంసారాల్లోని ఆర్థిక పరిస్థితులు "ముక్కుపట్టుకొంటే ప్రాణం పోయే పరిస్థితిలో" వుండడం సహజం. అల్లరి చిల్లరి వారిని అదుపు ఆజ్ఞలలోకి తేవలెనంటే "ముక్కుకు గాలం వేసి లాక్కు" రావలసి వస్తుంది. ముక్కు మొగం ఎరగనివారితో మెలగడం సామాన్యం కాదు. ఏ జోలీ అక్కరలేనివారు కృష్ణా రామా అనుకుంటూ "ముక్కుమూసుకుని" మూల కూర్చుని వుంటారు. ఈత రానివారు నీళ్ళలో "ముక్కుపట్టుకొని మునకలు" వేస్తారు. కొందరు చేదుమందు కూడా "ముక్కుపట్టుకొనే" త్రాగుతారు. ఆశ్చర్యం మితిమించితే "ఔరా!" అంటూ "ముక్కుమీద వేలువేసుకొంటా"రు. బిడ్డలు అట్టే దక్కనివారు పిల్లలకు ముక్కు కుట్టి కుప్పయ్య అని పేరు పెడతారు. కొందరికి "ముక్కు బెదిరి"నే నొప్పుగు కొరుతుంది.

లేతవయసుకు "ముక్కు పచ్చారని ప్రాయం" అంటారు. కళ్ళజోళ్ళకు "ముక్కద్దాలు" అనే ముద్దుపేరుకూడా వుంది. అరవంలో కూడా "మూక్కు కణ్ణాడి" అనే అంటారు. ఆ ముక్కద్దాలనే "ముద్దుముద్దుగ నంటు, ముక్కు పటుదునంటు - చెవులు గొంటు ‥గి నొంపనొక్కు" అని చమత్కరించినాడొక కవి. పిల్లలకు "ముక్కు కోసి సున్నం పెడతాము" అని భయపెడతాము. మన సామెత ప్రకారం మనం "ముక్కు కోసిన" గాయానికి "సున్నం పెట్టి" మాన్పదలిస్తే అరవలు "మూక్కరుత్తు మొళగాపొడి" వేసి (అనగా ముక్కు కోసి మిరపపొడి వేస్తాము అని అర్థం) పుండుమీద కారం చల్లుతారు. కోతిని గాని పిల్లలు "కోతీ, నా ముక్కు దురద" అంటూ అల్లరిచేస్తారు. ఒకరినొకరు "బర్రెముక్కు, కప్పముక్కు, సొట్టముక్కు" అని వేళాకోళం చేసుకొంటారు.

ముక్కుత్రాడు లేక గొడ్డును అదుపులోకి తేలేము. ప్రతి విషయంలోనూ అనవసరంగా జోక్యం కలిగించుకొనేవారిని *Do not poke your nose in unnecessary matters* అని ఆంగ్లంలో మందలిస్తాము.

"కాకి ముక్కుకు దొండపండా?" అనే సామెత తెలుగువారికి తెలియనిది కాదు. "చిలకముక్కు కాయ" అని ఓ రకం మామిడికాయకు పేరు. "నగరి ముక్కు" అని చిత్తూరు జిల్లాలోని ఒక చిన్న కొండకు పేరు. "*WAY IN*" అనే దారిలోనే ఆఫీసులోకి వెళ్ళి "*WAY OUT*" అనే దారిలోనే వెలుపలకి రావలెనన్న ఒక విధమైన క్రమశిక్షణకు అలవాటుపడినవారు ధూమపాన విధానంలోనూ ఆ పద్ధతినే అమలులోపెట్టి నోటిగుండా పొగపీల్చి ముక్కుగుండా వదులుతారు. "కాండిళ్ళకు ఒకే దూలం" అనే ముక్కునుగురించిన పొడుపుకథ కూడా పిల్లలకు బాగా తెలుసును.

పడిశంపడితే ముక్కు మూసుకుపోయి చిరాకు కలుగుతుంది. కాళీదేవి సహస్ర శిర

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

## పిల్లల ప్రత్యేక సంచిక : ముఖ్యగమనిక

### దసరాకు బదులు దీపావళికి వెలువడుతుంది.

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక పిల్లల ప్రత్యేక సంచిక ఏటేటా దసరాకు ప్రచురించబడుతున్నది. అదేవిధంగా ఈ సంవత్సరం కూడా ప్రకటించడం జరిగింది. కాని కారణాంతరాల వల్ల ఈ సంవత్సరం పిల్లల ప్రత్యేక సంచికను దీపావళికి ప్రచురించడం జరుగుతున్నదని పాఠకులు, ఏజెంట్లు గమనించ ప్రార్థన. దసరా పండుగకు మామూలు సంచిక ప్రచురించబడుతుంది. పిల్లలు పంపిన రచనలు, చిత్రాలు మొదలైనవి దీపావళికి ప్రచురించబడతాయి.

రచనలు పంపడానికి సెప్టెంబరు 20 వ తేదీ గడువుపెట్టి ఉన్నాము. పోటీకి పంపే పిల్లల రచనలను మాత్రం ఇకపైన స్వీకరించజాలము. ఇతరుల రచనలకు గడువు అక్టోబరు 20 వ తేదీ దీపావళి వ్యాసాలు, చిత్రాలు, ఫొటోలకు కూడా అక్టోబరు 20 వ తేదీ వరకు వ్యవధి ఉన్నది.

—సంపాదకుడు.

క్షిలతో, రెండు కరములతో ప్రత్యక్షం అయ్యేసరికి తెనాలి రామయ్యకు సంతోషం కలగడానికి బదులు సందేహం కలిగి "వెయ్యి ముక్కులను రెండు చేతులతో ఎలా చీదగలవు?" అని చిలిపిప్రశ్న వేసి "వికటకవి" అనిపించుకొన్నాడు—అమ్మవారిచేత.

పడిశం పడితే నేకాక ఏడ్చేటప్పుడు కూడా చీదుతారు. అందుకే "ఏడ్చేవారి ఎడమచేతిక్రింద, నవ్వేవారి కుడిచేతిక్రింద కూర్చోరాద"న్నారు. ఏదో సందర్భంలో భర్త తన మీద చేయిచేసుకోవడంవల్ల ఏడవవలసిన ప్రమేయం ఏర్పడి, తత్కారణంగా ముక్కు చీదవలసివచ్చి, తత్ఫలితంగా రొంపభారం వదిలించుకొన్న ఒకానొక సతీమణి, "మగడు కొట్టనైనా కొట్టాడు, ముక్కుభారం కాస్తా వదిలింది లెమ్మని" అమూల్యాభిప్రాయం వెలిబుచ్చి, అతగాడు కొట్టినదానికన్నా మించిన దెబ్బను అతని మీద త్రిప్పికొట్టింది. అదే ఆధునిక యుగంలోనైతే కోపంవచ్చి కోర్టుకు లాగి అతని అవకతవకతనాన్ని రచ్చకు తెచ్చి విడాకులు పుచ్చుకొని విడిపోతారు. విడిపోవడానికి వీలుకలిగించేది కాబట్టే ఆ చట్టం "విడాకుల చట్టం" అయింది. అలా మగలూ ఒక విస్తర్లో తింటూ ఒద్దికగా కాపురం చేయవలెననే ఉద్దేశ్యంతోనే, పెండ్లినాడు బువ్వం బంతి సందర్భంలో వధూవరులను ఒండొరుల విస్తళ్లలో ఎంగిలి వేసుకొంటుంటారు. లేదా వర్షన హడావిడి మిషతో వారిద్దరి విస్తళ్లను ఏకంచేస్తూ ఒక విధమైన విస్తరాకులచట్టం(?) అమలుపరిచి వారిద్దరినీ ఆ చట్టానికి బద్ధులను చేస్తారు.

కాబట్టి సరసానికి విస్తరాకులు విరసానికి "విడాకులు" ఏర్పడినవి. అటు ఆ విస్తరాకుల చట్టానికి లోబడడమూ, ఇటు ఈ విడాకుల చట్టానికి ఎగబడడమూ అన్న సందిగ్ధంలో వుంది మన నేటి సామాజిక పరిస్థితి. వివేకంతో కాపురం చేయగలిగిన ఇల్లాలికి విస్తరాకులు ఎక్కడ వాడడం, విడాకులు ఎక్కడ వాడడం అన్నది తెలుస్తుంది. సాంసారిక రంగంలో విస్తరాకులతో పాటు విడాకులకున్నూ కొద్దిపాటి ప్రయోజనంవున్నట్టే సాంఘికవ్యవస్థలో అక్కడక్కడ ఆపద్ధర్మంగా "విడాకుల"కు అవసరం కలగవచ్చు అందుకే "విడాకులచట్టం" వచ్చింది. ఆ "విడాకుల"ను వాడుకోవడం, వాడుకోకపోవడం విచారించి ఎవరి విషయంలో వారే నిర్ణయం చేసుకోవడంలోనే తెలివి తేటలున్నవిగాని వింతగా, విడ్డూరంగా చెప్పుకొంటూ విస్తుపోవడంలో లేనేలేదు "మాటలసందర్భంలో మనుబోలు వారు పిడూరికి చేరినార"న్నట్లు మహిళల సమస్యల్లో అనవసరంగా ముక్కుదూర్చడం మర్యాదకాదు కాబట్టి ఇంతటితో విరమిస్తాను. సెలవు.





శ్రీ రాజరాజేశ్వరీవారి "శ్రీకృష్ణతులాభారం' లో సత్యభామగా ఎస్ వరలక్ష్మి



తెనాలి రామకృష్ణ"లో అందరికీ తెలిసిన ఒక సన్నివేశం

# ఉత్తమచిత్రాల, నటుల ఎన్నిక
## ఫిలింఫాన్స్‌సంఘం నిర్ణయాలు

తెలుగులో 1954 సంవత్సరానికి ఉత్తమ చిత్రంగా వాహినివారి "పెద్ద మనుషులు" చిత్రాన్ని, ఉత్తమ నటుడుగా అందులో నటించిన ఎస్. లింగమూర్తి గారిని, ఉత్తమ నటిగా "విప్రనారాయణ"లో శ్రీమతి భానుమతిని మద్రాస్ ఫిలిం ఫాన్స్ సంఘం నియమించిన నిర్ణేతలు ఎన్నుకున్నారు.

ఉత్తమ ఉప పాత్రధారిగా "పెద్ద మనుషులు"లో రేలంగిని, ఉప పాత్రధారిణిగా "మా గోపి"లో జమునను, బాలనటుడుగా అందులోనే నటించిన మాస్టర్ వెంకటేశ్వర్ ను కూడా వారు ఎన్నుకున్నారు.

తమిళంలో ఉత్తమ చిత్రం ఎ. వి. ఎమ్. వారి "అందనాళ్"; ఉత్తమ నటుడు "తూక్కు తూక్కి"లో శివాజీ గణేశన్; ఉత్తమనటి "ఎదిర్ పారాదదు"లో పద్మిని; ఉపపాత్రధారి "కుటుంబం"లో తంగవేలు; ఉపపాత్రధారిణి "రక్తకన్నీర్"లో ఎమ్. ఎన్. రాజమ్ ఎన్నుకోబడ్డారు. ఉత్తమమైన థియేటర్ గా మిడ్‌లాండ్ నిర్ణయింపబడింది.

డా॥ యు. కృష్ణరావు గారి అధ్యక్షతను నియమింపబడిన ఏడుగురు నిర్ణేతలుగల సంఘం తెలుగులో 10, తమిళంలో 12 చిత్రాలు పరిశీలించి ఈ నిర్ణయాలు చేశారు.

ఈ నిర్ణయాలు ప్రకటించడానికి హోటల్ దాస ప్రకాశ్‌లో ఒక సభ ఏర్పాటు చేయబడింది. ఫిలిం ఫాన్స్ సంఘం అధ్యక్షుడు ఎ. అరుణాచలం, కార్యదర్శి ఇ. టి. శామ్యూల్ పై నిర్ణయాలనుగూర్చి మాట్లాడారు. సభకు హాజరైన లింగమూర్తి గారు తనకు ఉత్తమ నట గౌరవం ఇచ్చినందుకు ధన్యవాదాలు తెలిపారు. ఈ నిర్ణయం తనకు ఆశ్చర్యం కలిగించిందనీ, మామూలుగా నాయకపాత్ర ధరించే వ్యక్తికే దక్కే ఈగౌరవం తనకు రావడంవల్ల నటనాకళపై నిర్ణేతలకు గల అభిరుచి, ఆదరం వెల్లడవుతోందని ఆయన అన్నారు. "పెద్ద మనుషులు" చిత్రంలో తనకివ్వబడిన పాత్ర సులభమైనదైనా, ఎక్కువ నటిస్తే అతి అనీ, తక్కువ చేస్తే స్వల్పమనీ అనిపించుకునే స్వభావంగలదనీ, తన విధి తాను నెరవేర్చినందుకు ఫలితం దక్కిందనీ అన్నారు.

సభకు బొంబాయినటుడు డేవిడ్ హాజరయ్యారు. ఈయన ఎ. వి. ఎమ్. వారి



బొంబాయిలో "శ్రీ420" విడుదల సందర్భంలో సురయాను నవ్విస్తున్న రాజ్‌కపూర్

## ఉత్తమ చిత్రాల, నటుల ఎన్నిక

చిత్రంలో నటిస్తున్నారు. ఆయన మాట్లాడుతూ ఫిలింఫేర్ సంఘం చేస్తున్న కృషిని అభినందించారు. ఫిలింపరిశ్రమను సమర్థిస్తూ "చిత్రనిర్మాణం కేవలం వ్యాపారం. దాని ప్రధానలక్ష్యం ప్రజలకి వినోదం కలిగించడం. ప్రజల నైతికస్థాయిని అభివృద్ధి చెయ్యడం, విజ్ఞానవంతులనుగా చెయ్యడం చిత్రనిర్మాతలపని కాదు. అది విద్యాలయాలు, విశ్వవిద్యాలయాలు చేయవలసిన పని" అన్నారు.

పత్రికలలోను, రాజ్యసభ, లోక్‌సభలలోను సినిమాపరిశ్రమపై జరుగుతున్న విమర్శలను ఖండిస్తూ, "గడచిన ఏడేళ్లుగా ఈ విమర్శలు వస్తున్నాయి; అంతకుముందు చిత్రాలలో విమర్శించదగినవి లేవా? పిల్లలు చిత్రాలు చూసి నేరాలు చేస్తున్నారని ఒక ఆరోపణ. చిత్రాలు రాకముందు పిల్లలు నేరాలు చేసేవారే కాదా? సరియైన విద్యావిధానం వల్ల పిల్లలు బాగుపడతారు. చిత్రాలు మానడం వలన బాగుపడరు; చెడిపోనూ చెడిపోరు. వినోదం ఇవ్వడమే చిత్రాల లక్ష్యం అయితే అంతమేరకు అనైతికకరమైన వినోదం మా చిత్రాలలో ఉండడంలేదు. ఉంటే సెన్సార్ బోర్డు ఉండనే ఉన్నది," అని దేవిడ్ తమ పరిశ్రమను సమర్థించుకున్నారు.

సెన్సార్ అధికారులను తీవ్రంగా దుయ్యబడుతూ "సెన్సార్‌షిప్ ఉండడం అవసరమే. కాని ప్రస్తుతపు సెన్సార్‌షిప్ అనర్థంగా ఉన్నది. ఇష్టం వచ్చినచోట్ల కత్తిరించడమే సెన్సార్ల పని. ఒక ప్రభుత్వం ఒకభాగం కత్తిరించేస్తే, మరొక ప్రభుత్వం కేవలం మాత్రం ఎందుకు ఊరుకోవాలి? అది మరొక భాగం కత్తిరించేస్తారు. నిర్మాత పని ఏమైపోతుందో ఆలోచించండి," అని దేవిడ్ అన్నారు.

ఎవరైనా ఆదర్శవంతమైన చిత్రం, విమర్శలకు అతీతమైన చిత్రం తీస్తే అందులో పెద్ద తారలందరూ ఉచితంగా నటిస్తారని ఆయన సవాలు చేశారు.

డా|| యం. కృష్ణరావు మాట్లాడుతూ ఉత్తమ నటీనటులను నిర్ణయించడానికి తాము చాలా కష్టపడవలసివచ్చిందని, దీనికి కారణం అందరూ బాగా నటించడమేనని, నటన చాలా అభివృద్ధిఅయిందనీ అన్నారు. వాహినివారి "పెద్దమనుషులు" చిత్రాన్ని ఆయన ప్రత్యేకంగా ప్రశంసించారు. దేవిడ్ చేసిన విమర్శకు సమాధానం చెబుతూ తాము స్వయంగా ఏడేళ్లపాటు సెన్సార్ బోర్డులో పనిచేశామని, అందుచేత ఆవిమర్శ తమకు అంత సమంజసంగా కనిపించడం లేదని, సెన్సార్లపని చాలా కష్టమైనదనీ, ఎంతో ఆలోచించి, అన్ని విషయాలు పరిశీలించి, అప్పటికీ బాధపడుతూనే సెన్సార్లు కొన్ని దృశ్యాలను తీసివేయవలెనని ఆజ్ఞాపిస్తారనీ ఆయన అన్నారు. ప్రభుత్వమూ, పరిశ్రమలోనివారు సావధానంగా చర్చలు జరిపితే ఈ సమస్య పరిష్కారమవుతుందని ఆయన చెప్పారు.

రాయపాటి శ్రీమతి నల్లముత్తు రామమూర్తి మాట్లాడుతూ "బాలచిత్రాల ప్రయోజనం ప్రజలకు విద్య, విజ్ఞానం ఇవ్వడమే. ఇప్పటి చిత్రాలలో పిల్లలు చూడగూడని విషయాలు అనేకం ఉంటున్నాయి. అందుచేత పిల్లలకు, విద్యార్థులకు అనువైన చిత్రాలు నిర్మించే ఉద్దేశ్యంతో దేశమంతా

# బొంబాయి సినిమా లేఖ

రాజకపూర్ నిర్మించిన హిందీచిత్రం "శ్రీ420" ఈ నెల 7 వ తేదీన బొంబాయిలో రీగల్, స్వస్తిక్, బ్రాడ్వే థియేటర్లలో మహోత్సాహంతో విడుదల చేయబడింది. లేనివారికీ, ఉన్నవారికీ మధ్యగల తారతమ్యంమీద అల్లబడిన కథగల ఈ చిత్రం, ధనికవర్గాలు సులభంగా ధనం ఆర్జించడానికి అనుసరించే దుష్టమార్గాలను బయట పెడుతుంది. రాజ్ కపూర్ హాస్య నటనను ఈచిత్రం బాగా వెలుకలిగించింది. ముఖ్యంగా ఈ చిత్రంలో రాజ్ కపూర్ చార్లీచాప్లిన్ నడకను, వేషాన్ని, నటనను జయప్రదంగా అనుకరించి కృతకృత్యుడయ్యాడు. నాయకపాత్ర ధరించిన నర్గీస్ నటనాచాతుర్యానికి అట్టే అవకాశం కలగలేదు. నర్తకిపాత్ర ధరించిన నదీరా కొముకే వలె కనిపించిందేగాని నాట్యంలో విఫలురాలైంది. సంగీతం చక్కగా ఉన్నది. కాని ఒకే ఒక్కపాటతప్ప మిగతాపాటలేవీ ఒహాళికి ప్రచారంపొందే అవకాశం లేదు. ప్రొడక్షన్ విలువలు, ఫొటోగ్రఫీ ఆకర్షవంతంగా ఉన్నాయి.

ఈ చిత్రానికి పామరజనంనుండి, పిల్లలనుండి అమోఘమైన ఆదరణ లభించగలదు.

* * *

కొత్తగా పెళ్లాడిన షమ్మీకపూర్, గీతా, చెంబూర్ లో స్వంతభవనం కట్టుకోవాలని ఆలోచిస్తున్నారు. వచ్చే వేసవిలో కొత్త ఇంట్లోకి మారాలని వారి ఆలోచన. పెళ్లి అయిన తరువాత గీతా కొత్తచిత్రాలు చాలా వాటిలో బుక్ అయింది.

* * *

కొత్తతార జబీన్ సినిమారంగంలో స్థిరపడకుండానే పలుకుబడి పోగొట్టుకున్నది. ఆమె బుక్ అయిన రెండు కొత్త చిత్రాలకు ఏ డిస్ట్రిబ్యూటరూ డబ్బివ్వడానికి సాహసించనందున ఆమెను నిర్మాతలు తొలగించారు.

"ఇన్సానియత్"లో నటించిన తర్వాత బీనారాయ్ పలుకుబడి కూడా తగ్గింది. కలకత్తా, బొంబాయి డిస్ట్రిబ్యూటర్లపై ఆధారపడిన పల్వురు నిర్మాతలు ఆమెను ఇదివరకువలె బుక్ చేయడం తగ్గించారు.

* * *

విశ్వవిద్యాలయాలలో నుంచి చిత్రాలపైనే అభిరుచి పెంపొందించే ఒక పథకాన్ని కేంద్రప్రభుత్వం తయారుచేసింది. భావిపౌరులైన యువజనుల అభివృద్ధికి ఇది చాలా ముఖ్యమైనపథకం. ప్రయోజనరహితమైన కథలు, కామోద్రేకపు దృశ్యాలు, పాటలు, నృత్యాల దృశ్యాలు అర్థంలేని హాస్యంతో నిండిన చిత్రాలకు ఎగబడే మన యువకులకు ఈ విధమైన బోధనాపద్ధతి మంచి సంస్కారం కలిగిస్తుంది. ప్రభుత్వం ఈ పథకాన్ని అమలుచేస్తే మన చలనచిత్రాలు కూడా బాగుపడతాయి.

* * *

బొంబాయిలో విశేష ప్రజాదరణపొందిన "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" అమెరికాలోను, బ్రిటన్‌లోనూ త్వరలో విడుదల



నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి "జయసింహ"లో పద్మినిగా వహీదారహమాన్, చాంపావతిగా శీత.

టికి ఒకవాల చిత్రసంఘం నెలకొల్పబడింది. మద్రాసులోకూడా అటువంటి సంఘం త్వరలో నెలకొల్పుతున్నాము," అని అన్నారు. ★



"తులాభారం"లో సూర్యకాంతం, రేలంగి, ప్రభావతి

* * * * * *

సంతోషి నిర్మిస్తున్న "గర్మాగరమ్" హిందీచిత్రంలో ఓంప్రకాష్, ఆగా, నదీరా



# బొంబాయి సినిమాలేఖ

కొగలదు విదేశాలలో ప్రదర్శనకు వీలుగా ఆ చిత్రం 10 వేల అడుగులకు తగ్గించబడింది.

*  *  *

పండిట్ ముఖ్రం శర్మ కథతో నిర్మించబడిన "వచన్" చిత్రం బొంబాయిలో రజతోత్సవం చేసుకుంది. ఇదికాక మరి మూడు చిత్రాలు (నాగిన్, జాగృతి, అజాద్) ఈ ఏడాది రజతోత్సవం చేసుకున్నాయి.

*  *  *

భారతీయ ఫిలిం ప్రతినిధులతో కలిసి టెక్నీషియన్ కృష్ణగోపాల్ చైనా వెళుతున్న సందర్భంలో నిర్మాత గోవర్ధన్‌దాస్ అగర్వాల్ పెద్ద విందు ఏర్పాటుచేశారు.

అగర్వాల్ ప్రస్తుతం ఉషాకిరణ్ నాయికగా "తన్ హై" చిత్రం తీస్తున్నారు. ఈయన నిర్మిస్తున్న "క్లియోపాత్రా" చిత్రంకూడా సెట్స్‌కు వెళ్లింది. అందులో సుమిత్ర, ఆశామధుర్, ప్రదీప్‌కుమార్ నటిస్తున్నారు.

అశోక్‌కుమార్ బెంగుళూరులో ఒక పెద్ద బంగళా కొన్నారు. ఆయన అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకుంటారట.

"గర్మా గరమ్" సెట్స్‌మీద నటి నదీరా పత్రికావిలేఖరులు కొందరితో మాట్లాడుతూ, తాను మేరిలిన్ మన్రోకంటె చక్కని దేహసౌష్ఠవం, అందం కలదాన్నని చెప్పింది. కాని ఆ మాట ఎవరూ నమ్మలేదు!

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

## ప్రేక్షకుల అభిప్రాయాలు

## "దొంగరాముడు"

అన్నపూర్ణావారి "దొంగరాముడు" చిత్రం బాగానే ఉంది, కానీ టైటిలుకు, కథకు సంబంధమేమీ లేదు. నాగేశ్వరరావు అత్యంత ప్రతిభావంతంగా నటించి చిత్రానికి జీవం పోశాడు. సావిత్రి, జగ్గయ్య, ఆర్. నాగేశ్వరరావు, జమునలు తమపాత్రల నర్థంచేసుకొని నటించారు. రేలంగినటన మామూలుగానే ఉంది. సంభాషణలు చాలా బాగున్నాయి. పాటలు మధురతరంగా ఉన్నాయి. విఖ్యాతదర్శకులైన కె. వి. రెడ్డి గారి దర్శకత్వంలో కొన్ని చిన్న లోపాలుండడం శోచనీయం. హాస్టలువిడిచి జమున వెళ్ళిపోయేటప్పుడు, అక్కడ ఆమెను ఎవ్వరు చూడకుండా ఉండడం, రేలంగిని



వాసన్‌గారి చిత్రం "ఇన్సానియత్"లో బీనారాయ్



బొంబాయిలో "ఝనక్ ఝనక్..." విడుదలసందర్భంలో శ్రీమతి గోపీకృష్ణ, నర్తకుడు గోపీకృష్ణ, దర్శకుడు వి. శాంతారాం, కళాదర్శకుడు కనూ దేశాయ్, సంగీతదర్శకుడు వసంత్ దేశాయ్

ఖూనీచేసేటప్పుడు ఆ యింట్లో ఎవ్వరూ లేకపోవడం మొదలైనవి. చిత్రం నిడివి అనవసరంగా పెంచేశారు.

పి.ఎస్. శ్రీనివాసరావు—నెల్లూరు.

* * *

దొంగరాముడు చిత్రంలో కథాగమనం చక్కగా నున్నది పాటలు ఓ మోస్తరుగా నున్నవి రెడ్డిగారి దర్శకత్వంలో, వెంకాయమ్మ హోటల్ సన్నివేశం, కోర్టు సైతు దార్శనం, నాటీవాదనం వంటి సంఘటనలు ప్రేక్షకుల మన్ననలను లాగించినవి ఆ ఘట్టం కానికేసుచిత్రీకరణ అంత బాగుగా లేదు.

నాగేశ్వరరావు, జమున, రేలంగిల నటన ఉత్తమంగా నున్నది.

జొన్నాడ సత్యప్రసాద్ — కాకినాడ.

* * *

నాగేశ్వరరావు, సావిత్రి బాగా నటించారు నాగేశ్వరరావునటన, రెడ్డిగారి దర్శకత్వం చిత్రానికి జీవంపోశాయి

రేలంగి, ఆర్. నాగేశ్వరరావుల నటనలో అంత చెప్పుకోతగ్గది ఏమీ లేకపోయినా వారి పేరు నిలబెట్టుకున్నారు. పాతే జమున, జగ్గయ్యల నటన అంతగా బాగుండలా. పాటలలో మొట్టమొదటిపాట, నాగేశ్వరరావు జైలులో ఉన్నప్పటిపాట బాగున్నాయి

కథ చాల బిగువుగావుండి టెంపో బాగా ఉంటంవల్ల మొదటినుండి చివరివరకు ఎంతో బాగుంది. ఈ చిత్రం విజయవంతం అవుతుందనటానికి సందేహంలేదు.

కె. ఎల్. ప్రసాద్—బందరు.

* * *

కె. వి. రెడ్డిగారి దర్శకత్వంతో తయారయిన "దొంగరాముడు' చిత్రము బాగా చేయున్నది ఇతర చిత్రములలోకంటే దీనిలో ఆర్. నాగేశ్వరరావు నటనలో ప్రత్యేకత వున్నది. విచిత్రదయ్యగా రేలంగి నటన అద్భుతముగా వున్నది చిత్రం పొడుగునా పెండ్యాల నాగేశ్వరరావుగారి సంగీతము వినసొంపుగా వున్నది 'బాల గోపాల తరంగం' కుస్తీలు ప్రత్యేక ఆకర్షణాలు. నాగేశ్వరరావు, సావిత్రి, జమునల నటనలో ప్రత్యేకత ఏమీ లేదు.

'సీత' ప్రయోగించిన కౌగము తెల్లగా వుండుట హాస్యాస్పదము చిత్రంలో ముత్తెంపూవ విజ్ఞానంకన్న వినోదవు మోతాదు జాస్తిగా వుంది. ఇది విజయవంతం అవటానికి సందేహంలేదు

కార్తీభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి,
—చీరాల

★

## "బంగారుపాప"

వాహినీవారి "బంగారుపాప" తెలుగు చిత్రం మద్రాసు, కాసినో థియేటర్లలో విడుదల అయ్యేసందర్భంలో ఆ చిత్రాన్ని నిర్మాత, దర్శకులు శ్రీ బి. ఎన్. రెడ్డి దక్షిణ భారతఫిలిమ్ పత్రికారచయితల సంఘానికి ప్రదర్శించారు. ప్రదర్శనానంతరం సంఘ కార్యదర్శి 'పార్థ' చిత్రాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు

Printed and Published for
Nageswara Rao Estates Ltd., by
S. Radha Krishna at The
Andhra Patrika Press,
6&7, Thambu Chetty St. Madras
Editor: S. Sambhu Prasad 1.




అర్ధనారీశ్వర ఎలిఫెంటా శిల్పం

చిత్రకారుడు యం రాజా, దామెర్లస్కూలు—రాజమండ్రి

# మీకు ఉచిత కానుక!

సరకు ఉన్నంతవరకు




ఈ మనోహరమైన

## ప్లాస్టిక్ సబ్బు పెట్టెను

మీరు ఉచితంగా పొందెదరు

3 సామాన్య సైజు లేక 2 పెద్ద సైజు బిళ్లలు లక్స్ టాయిలెట్

సబ్బును మీరు కొన్నప్పుడు




## లక్స్ టాయిలెట్ సబ్బు

సినిమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

(మీ వూళ్లో యీ కాను[illegible] చేయుచుందురు)

భారతదేశంలో తయారుచేయబడినది

[illegible] X62 TL